# కార్మికలోకం

సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ కమిటీ మాసపత్రిక

సంపుటి: 27 | ఫిబ్రవరి 1999 | వెల: రు.5.00 | సంచిక:2


## ఐక్య ఉద్యమాలకు సి.ఐ.టి.యు. పిలుపు

### సంపాదకీయం



**సి.ఐ.టి.యు.** 8వ రాష్ట్రమహాసభలు జనవరి 10-12 తేదీలలో అనంతపురంలో జయప్రదంగా జరిగాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఆర్థిక విధానాలను తిప్పికొట్టి, కార్మిక హక్కుల పరిరక్షణకు సమైక్యపోరాటానికై మహాసభ పిలుపునిచ్చింది. అన్ని రంగాల, అన్ని ప్రాంతాల, అన్ని తరగతుల కార్మికులు ఉద్యోగులు సమైక్యంగా పోరాడటం ద్వారానే ప్రజావ్యతిరేక ప్రభుత్వ విధానాలను తిప్పికొట్టగలమని మహాసభ నిర్ణయించింది. విశాల విస్తృత ప్రాతిపదికపై కార్మికవర్గాన్ని ఐక్యం చేసే కృషిని ముమ్మరం చేయాలని మహాసభ నూతన నాయకత్వాన్ని ఆదేశించింది. ఈ పిలుపు రాష్ట్ర కార్మికవర్గంలో సమరశంఖారావం కావాలి.

నూతన ఆర్థిక విధానాలదాడి శ్రామికవర్గంపై పెరిగింది. ప్రైవేటీకరణలు, మూసివేతలు, లాకౌట్‌లు, లేఆఫ్‌లు పెరిగి ఉద్యోగ భద్రతకు ముప్పు వాటిల్లింది. వేతనాలపై దాడి జరుగుతున్నది. వున్న హక్కులు, కార్మికచట్టాలు నిర్వీర్యమౌతున్నాయి. వారిలో అసంతృప్తి పెరిగి స్పాంటేనియస్ పోరాటాలలోకి వస్తున్నారు. గత 4సంవత్సరాలుగా ఈ పోరాటాలనందుకొని ముందుకు తీసుకెళ్ళేందుకు కృషి చేశాము. ఈ కృషి చాలదని మహాసభ అభిప్రాయ పడింది. మరింత చొరవ, పట్టుదలతో పనిచేసి వుధృత పోరాటాలలోకి కార్మిక వర్గాన్ని సమీకరించాలి.

యజమానులు, పాలకవర్గాలు, సంస్కరణవాద సంఘాలు కార్మికవర్గాన్ని మానసికంగా బలహీన పరిచేందుకు సైద్ధాంతిక దాడి చేస్తున్నాయి. ఆర్థిక విధానాలు అనివార్యమని, వాటితో రాజీపడటం తప్ప పోరాడి వెనక్కి నెట్టలేమని ప్రచారం చేస్తున్నారు. తద్వారా వారినైతిక స్థయిర్యాన్ని దెబ్బతీసి, పోరాటశక్తిని నిర్వీర్యం చేస్తున్నారు. వారి ఐక్యతను బలహీన పరుస్తున్నారు. దీనికి ప్రతిగా శ్రామిక వర్గ భావజాలాన్ని వారిలో నిరంతర ప్రచారం చేసి పాలకవర్గాల సైద్ధాంతిక దాడిని సమర్థవంతంగా తిప్పికొట్టాలి.

ప్రభుత్వ ఆర్థిక విధానాలదాడి కేవలం ఉద్యోగులు, కార్మికులకే పరిమితంకాదు. రాష్ట్రంలోని శ్రామిక, తాడిత, పీడిత ప్రజలందరిపై ప్రభావం చూపుతున్నది. వ్యవసాయ కార్మికులు కూలీ, సామాజిక న్యాయం కోసం చేసే పోరాటాలలోను, మైనారిటీలకు అండగా నిలిచిన విలువైన అనుభవాలు మహాసభ చర్చించింది. ఈకృషి ప్రాథమికస్థాయిలోనే వుందని మహాసభ గుర్తించింది. ఇతర పీడితప్రజల పోరాటాలకు సంఘీభావాన్ని పెంచాలని మహాసభ నిర్ణయించింది.

బి.జె.పి. పాలనలో మతోన్మాదశక్తులు చెలరేగి, బరితెగించి మైనారిటీలు, కవులు, కళాకారులు, క్రీడాకారులు, సంఘసేవకులపై మతపరమైన దాడులు,హత్యాకాండ కొనసాగటం పట్ల మహాసభ ఆందోళన వ్యక్తం చేసింది. కార్మికవర్గం అప్రమత్తంగా వుండి దేశసమైక్యతకు, లౌకికపునాదికి ఏర్పడిన ముప్పును ప్రతిఘటించాలని విజ్ఞప్తి చేసింది.

'ప్రపంచీకరణ' సిద్ధాంతాన్ని వత్తిడి, బెదిరింపులతో అమలు జరిపేందుకు సామ్రాజ్యవాదులు పూనుకుంటున్నారు. తమ మార్గానికి అడ్డుగావున్న క్యూబా, ఇరాక్, లిబియాలపై దాడులు, నిర్బంధాలు ప్రయోగిస్తున్నారు. ఈ దుర్ఘటనలపై అంతర్జాతీయ సంఘీభావం తన మోతాదులో లేకపోవటం పట్ల మహాసభ విచారం వ్యక్తం చేసింది. ఈ అకృత్యాలకు వ్యతిరేకంగా సి.ఐ.టి.యు స్పందించింది. మన కార్మికవర్గంలో సామ్రాజ్యవాద చైతన్యం కల్పించే కృషిని, సంఘీభావ కృషిని పెంచాలని అభిప్రాయపడింది.

పై కర్తవ్యాలనిర్వహణకు రాష్ట్ర వ్యాప్తంగా మనవుద్యమం ఎదగాలని మహాసభ గుర్తించింది. మన కార్యకలాపాలు, ఒక మూలకు, ఒక రంగానికి, ఒక ప్రాంతానికి పరిమితం కారాదు. అన్ని రంగాలు, అన్ని ప్రాంతాలకు వుద్యమాన్ని విస్తరించాలని మహాసభ నిర్దేశించింది. సకాలంలో మహాసభ రూపొందించిన సరైన కర్తవ్యాల అమలుకు రాష్ట్రవ్యాపితంగా వుమ్మడి పట్టువట్టి అమలుకు పూనుకోవాలని కోరుతున్నాము. మహాసభల నిర్వహణకు సహకరించిన అనంతపురం జిల్లా ప్రజలకు, ఆహ్వానసంఘానికి, జిల్లా నాయకత్వానికి 'కార్మికలోకం' అభినందనలు తెల్పుతున్నది. ★

కార్మికవర్గంపై పెనుభారాలు మోపుతున్న

# సరళీకృత ఆర్థిక విధానాలను ప్రతిఘటించండి

## సి.ఐ.టి.యు. 8వ



**కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అవలంబిస్తున్న ఆర్థిక, పారిశ్రామిక విధానాలు కార్మికవర్గంపై విపరీతమైన భారాలు మోపుతున్నాయి. ఈ విధానాలకు వ్యతిరేకంగా వారిలో పెద్దఎత్తున అసంతృప్తి పెల్లుబుకుతున్నది. కనీస వేతనాల అమలు కోసం, ప్రైవేటీకరణ, ఫ్యాక్టరీల మూసివేతలు, యాజమాన్య కక్షసాధింపు చర్యలు, పోలీసు నిర్బంధానికి వ్యతిరేకంగానూ కార్మికవర్గం వివిధ ప్రాంతాల్లో వివిధ రూపాల్లో పోరాడుతున్నది. కొత్త తరగతులు, కొత్త రంగాలకు చెందిన కార్మికులు తమ జీవన భృతిని దెబ్బతీసే ఆర్థిక విధానాలపై పోరాడుతున్నారు. ఈ విడివిడి పోరాటాల వల్ల ఆర్థిక విధానాలను వెనక్కి తిప్పికొట్టలేమని; అన్ని పరిశ్రమల్లోని, అన్ని రంగాల్లోని కార్మికులు, ఉద్యోగులు ఈ పోరాటాలన్నింటిని ఏకీకృత ప్రవాహంగా ఐక్యం చేయాలని, గరిష్ట స్థాయిలో కార్మికవర్గ ఐక్యతను సాధించాలని జనవరి 10, 11, 12 తేదీల్లో అనంతపురంలో జరిగిన సి.ఐ.టి.యు. 8వ రాష్ట్ర మహాసభ కార్మికవర్గానికి పిలుపునిచ్చింది.**

రాష్ట్రంలో సాగే కార్మిక పోరాటాలన్నింటిలో సి.ఐ.టి.యు. జోక్యం చేసుకోవాలని, అన్ని మండలాలకు, రంగాలకు, తరగతులకు సి.ఐ.టి.యు.ను విస్తరింప చేయాలని, అందుకవసరమైన కార్యకర్తల శిక్షణకు ప్రత్యేక ప్రాధాన్యతనిచ్చి కృషిచేయాలని అన్ని స్థాయిల్లోని సి.ఐ.టి.యు. కమిటీలను మహాసభ ఆదేశించింది.

రాష్ట్ర గౌరవాధ్యక్షులు కా॥ పర్సా సత్యనారాయణ పతాకావిష్కరణతో జనవరి 10వ తేదీన అత్యంత ఉత్సాహపూరిత వాతావరణంలో రాష్ట్ర 8వ మహాసభ అనంతపురంలో ప్రారంభమైంది. మహాసభ ప్రాంగణం కా॥ మంచికంటి రామకిషన్‌రావు సమైక్యతానగర్‌ను, కా॥ కె.సాంబశివరావు ప్రాంగణాన్ని అందంగా అలంకరించారు. ప్రముఖ న్యాయకోవిదులు, రాజ్యాంగ నిపుణులు, అనంతపురం పట్టణ ప్రముఖులు ప్రొఫెసర్ గౌస్ గారు ఆహ్వానసంఘం తరపున ప్రతినిధులను ఆహ్వానిస్తూ ఉపన్యసించారు. రాష్ట్ర అధ్యక్షులు కా॥ నండూరి ప్రసాదరావు అధ్యక్షోపన్యాసం చేశారు. మహాసభలను ప్రారంభిస్తూ సి.ఐ.టి.యు. ప్రధాన కార్యదర్శి డా॥ఎం.కె.పాంథే కార్మిక సంఘాలు ఉమ్మడి అవగాహనతో ఏకోన్ముఖులై ప్రపంచీకరణకు వ్యతిరేకంగా పోరాడాలని పిలుపునిచ్చారు. ప్రజలకు గాక పెట్టుబడి దారులకు మాత్రమే ప్రయోజనం చేకూర్చే ప్రపంచీకరణను తక్షణమే అడ్డుకోనట్లయితే, ఇప్పటి వరకు కార్మికవర్గం సాధించిన హక్కులు, ప్రయోజనాలకు ఎసరు వస్తుందని హెచ్చరించారు.

కేంద్రంలో అధికారానికి వచ్చిన బి.జె.పి. ప్రభుత్వం గత తొమ్మిది నెలల్లో కార్మికవర్గానికి అనుకూలమైన చట్టం ఒక్కదాన్ని కూడా తీసుకురాకపోగా ఉన్న చట్టాలను నీరుగార్చబోతున్నదని అన్నారు. ప్రధానమైన అంశాలపై కనీసం ఒక్క త్రైపాక్షిక సమావేశం గాని, ఏటా జరగాల్సిన కార్మిక సభను గాని నిర్వహించలేదని శ్రీ పాంథే తెలిపారు. కార్మిక సభల మధ్య పని చేయాల్సిన స్టాండింగ్ కమిటీ గత ఏడాది స్లీపింగ్ కమిటీగా మారిపోయిందని, సి.ఐ.టి.యు. వత్తిడి మేరకు బి.జె.పి. ప్రభుత్వం దాని సమావేశాన్ని పిలిచి వాయిదా వేసిందని చెప్పారు.

దశాబ్దాల తరబడి పోరాడి సాధించుకున్న హక్కులు, సౌకర్యాలకు ఎసరు తెచ్చే ప్రతిపాదనలు చేసిన బి.జె.పి. ప్రభుత్వం కనీసం కార్మిక సంఘాలతో చర్చలు జరపకుండా ఒక సవాలు విసిరి ఉందని, దానిని ఎదుర్కొనటం మినహా మరో దారి లేదని పాంథే అన్నారు. అందుకు ఈ మహాసభ మార్గాలను చర్చించాలన్నారు. పార్లమెంట్

## కార్మికవర్గ ఐక్యతను దెబ్బతీస్తున్న

# మతోన్మాదాన్ని ఎదిరించండి

## రాష్ట్ర మహాసభ పిలుపు

ముందున్న బోనస్‌పై పరిమితిని ఎత్తివేసే, కార్మికుల భాగస్వామ్యానికి సంబంధించి, సమగ్ర వ్యవసాయ కార్మిక బిల్లుల ఆమోదానికి బి.జె.పి. ప్రభుత్వానికి తీరికలేక పోయిందని అన్నారు. అదే సమయంలో ప్రపంచ బ్యాంకు వత్తిళ్ళకు లొంగి కాంట్రాక్టు కార్మికుల విస్తృత వినియోగానికి, యజమానుల చిత్తం ప్రకారం పరిశ్రమలు మూసివేసే వీలుకల్పిస్తూ, ఎగుమతి జోన్ల పరిశ్రమల్లో మహిళలను కూడా రాత్రిపూట డ్యూటీలకు అనుమతించే చట్ట సవరణలకు తొందర పడుతున్నదని బి.జె.పి. కార్మికవర్గ వ్యతిరేక వైఖరిని దుయ్యబట్టారు.

ప్రపంచ పెట్టుబడిదారులు కార్మికవర్గం కంటే మరింత ఐక్యంగా పటిష్టంగా వ్యవహరిస్తున్నారని చెప్పారు. వేతనాలు, పని పరిస్థితులు, శ్రామిక మహిళలు, అసంఘటితరంగ కార్మికుల సమస్యలపై ఎన్ని ఉద్యమాలు చేసినా ప్రపంచీకరణకు వ్యతిరేకంగా పోరాడకుండా ముందుకు పోలేమని పాంధే స్పష్టం చేశారు. దాని ప్రభావాలను, పర్యవసానాలను కార్మికవర్గానికి వివరించేందుకు పెద్ద ఎత్తున అవగాహన కార్యక్రమాలు చేపట్టాలని కోరారు. ధరల పెరుగుదలపై ఆగ్రహం వ్యక్తం చేస్తున్న అనేక మంది అవి ఏ విధానాల వలన పెరుగుతున్నాయో అర్థం చేసుకోలేకపోతున్నారని చెప్పారు.

సర్వ ధర్మ సహిష్ణుత సంస్కృతి కలిగిన దేశ సమైక్యతకు బి.జె.పి., ఆరెస్సెస్ మతోన్మాదులు ముప్పు తెస్తున్నారని పాంధే హెచ్చరించారు. క్రైస్తవులు, ముస్లిం మైనారిటీలపై దాడులే గాక చివరకు క్రికెట్‌ను కూడా ఆడనివ్వడం లేదని అన్నారు. వివేకానందుడు అమెరికా పర్యటనలో క్రైస్తవులను సోదరులుగా సంబోధించిన అంశాన్ని గుర్తు చేశారు. మతోన్మాదులు ఈ ప్రమాదకర ధోరణులపై కార్మికవర్గాన్ని చైతన్యపరచాలని కోరారు.

తర్వాత రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కా॥ బి.వి.రాఘవులు నివేదిక ప్రవేశపెట్టారు.

గ్లోబలైజేషన్, సరళీకృత విధానాల ప్రభావం అంతర్జాతీయంగా కార్మికవర్గంపై చూపుతున్న ప్రమాదాన్ని, దానికి వివిధ దేశాల కార్మికవర్గం ఇస్తున్న ప్రతిఘటనను నివేదిక పేర్కొన్నది.

దేశంలో గత 4 సంవత్సరాలుగా కేంద్రంలో 3 ప్రభుత్వాలు మారాయి. విభిన్న ధోరణులు, విధానాల పేరుతో అధికారం నెరిపిన ఈ మూడు ప్రభుత్వాలు ఉదారవాద విధానాలను అవలంబించటంలో ఒకదానితో ఒకటి పోటీపడుతున్నాయి. ప్రస్తుత బి.జె.పి. ప్రభుత్వం అవలంబించే ఆర్థిక, పారిశ్రామిక విధానాలను, దాని మతోన్మాద ఎజెండాను ఓడించటమే భారతదేశ కార్మికవర్గ కర్తవ్యమని నివేదిక పేర్కొంది.

రాష్ట్రంలోని తెలుగుదేశం ప్రభుత్వం సెక్యులర్ శక్తులకు ద్రోహం చేసి మద్దతు ఇవ్వటం వల్ల మాత్రమే కేంద్రంలో బి.జె.పి. ప్రభుత్వం అధికారంలో కొనసాగగల్గుతున్నదనే వాస్తవాన్ని మహాసభ గమనంలోకి తీసుకున్నది. దీనికితోడు రాష్ట్రంలో ప్రపంచబ్యాంకు ఆదేశిత విధానాలను టి.డి.పి. ప్రభుత్వం అమలు చేస్తున్నది. యజమానుల ఇష్టారాజ్యం యధేచ్ఛగా సాగుతున్న తీరును నివేదిక సోదాహరణంగా పేర్కొన్నది.

ఈ విధానాలపై కార్మికవర్గం పోరాడటానికి సిద్ధంగా లేదనేది కేవలం అపప్రధ మాత్రమే. ఆర్టీసి, విద్యుత్, ఆల్విన్ ఆటో మొదలైన పోరాటాలుగాని, డిసెంబర్ 11 సమ్మె జయప్రదమైన తీరుగాని మనకు తెలియజేసేదేమంటే అసలు లోపం పోరాటాలకు పిలుపివ్వని వివిధ సంస్కరణవాద సంఘాల నాయకుల రాజీధోరణి తప్ప కార్మికులు మాత్రం పోరాటాలకు సిద్ధంగా ఉన్నారని ప్రధాన కార్యదర్శి నివేదిక పేర్కొన్నది. ప్రభుత్వం, యాజమాన్యాలు, ఈ సంస్కరణవాద సంఘాల నాయకులు కార్మికుల్లో ప్రవేశపెడ్తున్న వివిధ తప్పుడు సిద్ధాంతాలను, వాటివల్ల కార్మికుల్లో ఏర్పడే నైరాశ్యం ల గురించి, వీటికి వ్యతిరేకంగా సి.ఐ.టి.యు. జరపాల్సిన "సైద్ధాంతిక కృషి" గురించి నివేదిక ప్రత్యేకంగా చర్చించింది. ఈ నేపథ్యంలో వివిధ రంగాలు, సంస్థలు, ప్రాంతాల్లో కార్మికులు సి.ఐ.టి.యు. ఉన్నా, లేకున్నా, అసలు ఏ కార్మిక సంఘ నాయకత్వం ఉన్నా, లేకున్నా తమంతట తాము పోరాటాల్లోకి వస్తున్నారు. ఈ 'స్పాంటేనియస్' ఉద్యమాలన్నింటిలో సి.ఐ.టి.యు. జోక్యం చేసుకోవాలి. అందుకు రాష్ట్రంలోని అన్ని మండలాలకు, అన్ని రంగాలకు, తరగతులకు విస్తరించటం కీలక కర్తవ్యమని ప్రధాన కార్యదర్శి నివేదికలో పేర్కొన్నారు.

గత 4 సంవత్సరాలుగా రాష్ట్రంలో సి.ఐ.టి.యు. ఇటువంటి కృషి చేసినందువల్లే మంచి అభివృద్ధి సాధించింది. కార్మికులు, ఉద్యోగులు ఎదుర్కొంటున్న ప్రతి సమస్యపైనా ఆందోళన చేయటం, వారి ప్రయోజనాలను రక్షించేందుకు శక్తిమేరకు వివిధ రూపాల్లో కృషి చేయటం వల్ల సి.ఐ.టి.యు. ప్రతిష్ట పెరిగింది. ప్రతి కార్మికుడికి సి.ఐ.టి.యు. పేరు తెలిసేలా చేయగలిగామని నివేదిక పేర్కొంది.

అనుబంధ సంఘాల సంఖ్య 404 నుండి 726కి, సభ్యత్వం 125681 నుండి 214163 కి పెరిగింది. పూర్తి కాలం కార్యకర్తల సంఖ్య 1994లో 153 ఉండగా ప్రస్తుతం - 324 కి, వృత్తి చేసుకుంటూ పని చేసే కార్యకర్తల సంఖ్య 313 ఉండగా నేడది 462 కి పెరిగింది. కార్మికలోకం సర్క్యులేషన్ రెట్టింపయింది. ఉద్యమం 182 మండలాల నుండి 442 మండలాలకు, 124 పారిశ్రామిక/కార్మిక కేంద్రాల నుండి 219 కేంద్రాలకు, విస్తరించింది. గ్రామీణ ప్రాంతాలకు విస్తరించియున్న సుమారు 50వేల మంది గ్రామసేవకులలో, వివిధ మధ్యతరగతి రంగాలు, ప్రభుత్వ రంగ సంస్థలు, మొ॥వారిలో అనుకూల వాతావరణం పెరిగింది. రాష్ట్ర వ్యాపితంగా మన సమీకరణ శక్తి పెరిగింది.

రాష్ట్ర కార్మిక వర్గాన్ని ప్రభావితం చేయగల్గిన ఆర్టీసీ, విద్యుత్తు, కోల్ రాష్ట్ర ప్రభుత్వోద్యోగులు, ఇతర మధ్యతరగతి రంగాల్లో ఇంకా బలపడాల్సి ఉంది. వేలాది అసంఘటిత రంగ కార్మికులు, అనేక వృత్తులు చేసేవారు ట్రేడ్ యూనియన్ ఉద్యమం వెలుపలనే ఉన్నారు. ఇవన్నీ సాధించగల్గినపుడే, రాష్ట్రంలో బలాబలాల్లో మార్పును తొందరగా సాధించగలమని నివేదికలో పేర్కొన్నారు.

## అసంఘటిత రంగంలో క్యాంపెయిన్

అసంఘటిత రంగంలోని కార్మికులను కదిలించేందుకు సి.ఐ.టి.యు 1995-96లో పెద్దయెత్తున కాంపెయిన్ నిర్వహించింది. 8 రంగాలను ఎంచుకుని ప్రత్యేకంగాను, మొత్తం 26రంగాలలో కృషి జరిగింది.

23 జిల్లాల్లో 770 దళాలతో 1,44,699 మంది కార్మికులలో సర్వే చేసి, 6,74,500 కరపత్రాలు వేసి పంచాం. 249 సదస్సులు నిర్వహించాం. 1,07,990 సంతకాలు సేకరించాం. 25000 మందితో హైదరాబాద్‌లో ప్రదర్శన నిర్వహించాం. ఈ ఉద్యమం సందర్భంగా మొత్తం 26 రంగాలలో కృషి జరిగింది. అనేక జిల్లాల్లో ఈ ఆందోళన ద్వారా అసంఘటిత రంగంలోకి చొచ్చుకు పోగలిగాం. ఈ క్యాంపెయిన్ సందర్భంగా హమాలీ, భవన నిర్మాణం, లారీ, రైస్‌మిల్స్, బీడీ, షాప్ ఎంప్లాయీస్, ఇంటి పనివారలు తదితర రంగాలలో అనేక జిల్లాలలో కొత్తగా సంబంధాలు రావటం గాని, ఉన్న రంగాలలో విస్తరించటం గాని జరిగింది.

## పెన్షన్ స్కీం వ్యతిరేక ఆందోళన

కార్మికుల ప్రావిడెంట్ ఫండ్‌ను కాజేస్తున్న పెన్షన్‌స్కీంకు వ్యతిరేకంగా దేశ వ్యాపితంగా సాగిన ఆందోళనలో మన రాష్ట్రంలో సి.ఐ.టి.యు. చురుకుగా పాల్గొన్నది. సుమారు 180రకాల కరపత్రాలు 14,32,500 వేసి పంచింది. 12 సదస్సులు, 579 సమావేశాలు నిర్వహించటం వల్ల 23.2.96న జరిగిన దేశ వ్యాపిత సమ్మెలో 1589 సంస్థల్లో 1,77,559 మంది కార్మికులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా అనేక సంస్థల్లోకి, తరగతులలోకి సి.ఐ.టి.యు. విస్తరించింది. ఇతర సంఘాల వెనుకనున్న కార్మికులను సైతం పోరాటంలోకి దించగలిగింది. అనేక భారీ మధ్య తరహా పరిశ్రమలలో సంబంధాలొచ్చాయి. యూనియన్ల సభ్యత్వం పెరిగింది. ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలలో ఈ సందర్భంగానే ప్రవేశించాం. ఈ ఆందోళనతో మెడికల్ రిప్రెజెంటేటివ్‌లు బాగా దగ్గరయినారు. అనంతపురం, మెదక్ జిల్లాల్లో టెక్స్‌టైల్ రంగంలో సంబంధాలు బలపడ్డాయి.

## ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా

రాష్ట్ర ప్రభుత్వం ప్రైవేటీకరణ దాడికి ఎదురు లేదని విర్రవీగుతున్న దశలో కూడా సిఐటియు నాయకత్వంలో అంగన్‌వాడి ఉద్యోగినులు తమ ప్రాజెక్టుల ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా మిలిటెంటు పోరాటాలు చేసారు. నిరంతర ఆందోళనలతో బాటు ప్రాజెక్టు స్థాయిలో ధర్నాలు, రాస్తారోకోలు నిర్వహించారు. మదర్స్ కమిటీల నియామకంపై జి.ఓ. నెం. 48కి వ్యతిరేకంగా 16000 మందిని హైదరాబాదు ప్రదర్శనకు సమీకరించి 3 గంటల పాటు రాస్తారోకో నిర్వహించి, పాత ప్రాజెక్టులకు ఆ జి.ఓ. వర్తించకుండా ప్రభుత్వాన్ని కొంత వెనక్కి నెట్టగలగటంతో ఆ ఉద్యోగినులలో పోరాటాల పట్ల విశ్వాసం పెరిగింది.

విద్యుత్తు రంగంలో ఈ కాలంలో నికరంగా నిర్వహించిన ఆందోళన ద్వారా రెండుసార్లుగా 5 రోజులు విద్యుత్తు కార్మికులను సమ్మె పోరాటంలోకి దించడానికి సి.ఐ.టి.యు. కృషి ఎంతగానో తోడ్పడింది. జెసిఎ ఆధ్వర్యంలో 1997 ఆగస్టు 18, 19 తేదీలలో రెండు రోజుల సమ్మె అనంతరం కొన్ని సంఘాలు ప్రభుత్వంతో కుమ్మక్కై బూటకపు ఒప్పందం కుదుర్చుకున్న తర్వాత వాటి విద్రోహాన్ని ఎండగట్టి, మన ఆందోళన నికరంగా నిర్వహించడంతో మరోసారి 1104 యూనియన్ 1998 ఏప్రిల్‌లో సమ్మె చేయక తప్పలేదు. ఈ రెండు సమ్మెల సందర్భంగా సిఐటియు కృషిని విద్యుత్తు కార్మికులు హర్షించారు. సి.ఐ.టి.యు. అనుబంధ యూనియన్ ప్రతిష్ట పెరగడానికి కూడా ఇది దోహదపడింది.

## మూసివేతలకు వ్యతిరేకంగా

ఆల్విన్ ఆటో మూసివేతకు వ్యతిరేకంగా 100 రోజుల పోరాటంలో సిఐటియు కీలక పాత్ర పోషించింది. ఐక్యకార్యాచరణకు కృషి చేయడంతో బాటు, సంఘీభావ ఉద్యమం కూడా పెంపొందించే చర్యలు చేపట్టింది. హైదరాబాదు, రంగారెడ్డి, మెదక్ జిల్లాల పారిశ్రామిక బంద్‌కు వివిధ ట్రేడ్ యూనియన్‌ల ఆధ్వర్యంలో ఇచ్చిన పిలుపు జయప్రదం చేయడంలో సిఐటియు అగ్రభాగాన నిలిచింది. హైదరాబాద్ నగరంలోని అత్యధిక పారిశ్రామిక వాడల్లో ఈ బంద్ జరిగింది. 1486 రీడిప్లాయిడ్ ఆల్విన్ ఉద్యోగులను తొలగించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించడంతో 3 గంటల పాటు సెక్రటేరియట్‌ను స్తంభింప జేసే విధంగా రాస్తారోకో నిర్వహించడం వల్ల 188 మంది 4 రోజుల పాటు జైలు పాలయ్యారు. వీరిలో 32 మంది మహిళలు.

ఆంప్రో కంపెనీ అక్రమ మూసివేతకు వ్యతిరేకంగా మన నాయకత్వంలో పోరాటం జరిగింది. మూసివేసిన తర్వాత మన నాయకత్వంలోకి వచ్చినప్పటికీ, కార్మికులందరిని పోరాటంలో భాగస్వాములను చేసి, అందరికి ఆమోదయోగ్యమైన ఒప్పందం చేయగలిగింది.

## వేతన సవరణకోసం

హైదరాబాదు నగరంలోని ప్రధాన వాణిజ్య కేంద్రాలలో ఒకటైన మహరాజ్‌గంజ్ ప్రాంతంలో 800 మంది గోనెసంచులు కుట్టే కార్మికులు వేతనాల పెంపుదలకోసం 40 రోజుల సుదీర్ఘ పోరాటం సిఐటియు నాయకత్వంలో నిర్వహించారు. వీరిలో అత్యధికులు మహిళలు. ఈ ఉద్యమాన్ని కాపాడటంలో హమాలీలు కీలక పాత్ర పోషించారు. వీరికి మద్దతుగా హమాలీలు ఒక రోజు బంద్ పాటించడం, పోరాట ఖర్చులన్నీ వారే భరించడం, నగరంలోని వ్యాపార కేంద్రాలన్నింటిలో కరపత్రాలు పంచి ఆందోళన నిర్వహించడంవంటివి ఈ పోరాటం జయప్రదం కావడానికి తోడ్పడ్డాయి.

శ్రీకాకుళం జిల్లా శ్యాంపిస్టన్స్ కార్మికుల ఆ సుదీర్ఘ పోరాటం 222 రోజులు చేశారు. తొత్తు యూనియన్‌తో బూటకపు వేతన ఒప్పందం చేసుకున్న యాజమాన్యం కార్మికులందరి మీద రుద్దే ప్రయత్నం చేయడం, యూనియన్ నాయకుల మీద కక్ష సాధింపు చర్యలకు పాల్పడడంతో సమ్మె ప్రారంభమైంది. డ్యూటీలోనున్న కార్మికులపైన తన అనుయాయులతో దాడులు కూడా యాజమాన్యం చేయించింది. లోకల్, నాన్‌లోకల్ పేరుతో చీలికలు తెచ్చే ప్రయత్నం పోలీసు గూండా దాడులు, కోర్టు ఇంజెక్షన్‌ల

మధ్య ఈ పోరాటం సాగింది. చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజల మద్దతు కూడగట్టడం, జిల్లాలోని అన్ని రాజకీయ పార్టీల మద్దతు కూడగట్టడం, కలెక్టరేట్‌కు ఆకలి యాత్రలు, పోటీ కార్మికులను నిరోధించేందుకు కంపెనీ వద్ద పికెటింగ్స్, రణ స్థలం మండల పరిషత్ చేత ఈ కార్మికుల పోరాటానికి మద్దతుగా తీర్మానం చేయించడం, నిరవధిక నిరాహారదీక్షలు నిర్వహించడంతో బాటు చివరకు కలెక్టర్ జోక్యంతో ఈ సమస్య పరిష్కారమైంది.

విశాఖ జిల్లా పెందుర్తి రైల్వే స్లీపర్ కార్మికుల పోరాటం కూడా దీర్ఘకాలం జరిగింది. 3సార్లు సంఘీభావ ప్రదర్శనలు జరిగాయి. 2003 మంది మున్సిపల్ కార్మికుల వారం రోజులు సమ్మె, ఆమరణ నిరాహారదీక్ష నిర్వహించి జయప్రదమైనారు. గౌతమి స్టీల్స్, ఎవర్‌గ్రీన్, విశాఖ జిల్లా రామా ఫ్లైవుడ్‌లలో కూడా సుదీర్ఘ పోరాటాలు జరిగాయి. నెల్లూరు జిల్లాలో 7000మంది ప్రైవేట్ మోటారు ట్రాన్స్‌పోర్టు కార్మికులు 10రోజులు సమ్మె చేసి జయప్రదంగా వేతనాలు పెంచుకున్నారు.

## ట్రేడ్ యూనియన్ హక్కులకోసం

హైదరాబాదులోని అపోలో హాస్పిటల్‌లో యూనియన్ పెట్టుకున్నందుకు యాజమాన్యం కక్షబూని నాయకులను పనిలోనుండి తొలగించింది. యూనియన్‌ను విచ్ఛిన్నం చేసేందుకు యాజమాన్యం లక్షలాది రూపాయల డబ్బు ఖర్చు చేసింది. అయినా 2 నెలల పాటు కార్మికులు అనేక నిర్బంధాల మధ్య సిఐటియు నాయకత్వంలో పోరాడడం, నగర కార్మిక వర్గాన్ని ప్రభావితం చేసింది. వారం రోజుల పాటు కార్మికులందరూ హాస్పటల్ ఎదురుగానే రోడ్డుపైన రేయింబవళ్ళు బైఠాయించారు. కేంద్ర, రాష్ట్ర సిఐటియు నాయకులు, ప్రజాతంత్ర ఉద్యమ నాయకులు ప్రత్యక్షంగా ఉద్యమానికి తోడ్పడ్డారు.

నిమ్స్ కార్మికులు 8గం॥ పనిదినం కాపాడుకోడానికి, ఉద్యోగుల తొలగింపుకు వ్యతిరేకంగా చేసిన పోరాటం కూడా వారం రోజుల బైఠాయింపు తర్వాతనే పరిష్కారం అయింది. ఈ పోరాటంలో 500 మంది పాల్గొన్నారు.

విశాఖలో పెప్సీ యాజమాన్యం కార్మికుల మీద వచ్చి నిర్బంధాన్ని ప్రయోగించినా, కార్మికులు ధైర్యంగా నిలబడి పోరాడారు. అక్రమంగా 12 మంది కార్మికులను అరెస్టు చేయించి రిమాండు చేయించింది. దీనికి వ్యతిరేకంగా ధర్నా నిర్వహిస్తున్న 8 మంది మహిళలతో సహా 80 మందిని తప్పుడు కేసుల్లో ఇరికించి జైల్లో పెట్టించింది. సంఘీభావ ఉద్యమం నిర్మించడం ద్వారా ఆ కార్మికులకు నైతిక బలాన్ని చేకూర్చారు. 40 రోజుల పాటు పోరాటం తర్వాత యాజమాన్యం దిగి వచ్చింది. విశాఖ నగరం మీద, చుట్టుప్రక్కల గ్రామాల మీద ఇది మంచి ప్రభావం చూపింది.

విశాఖ - బిర్లా పెరిక్లేన్‌లో కార్మికులకు తెలియకుండానే, రిట్రెంచిమెంటుకు అంగీకరిస్తూ, సౌకర్యాలు రద్దుచేస్తూ, ఎ.ఐ.టి.యు.సి., టి.ఎన్.టి.యు.సి. యూనియన్లు ఒప్పందం చేశాయి. దీనితో మొత్తం 1500ల మంది కార్మికులు సి.ఐ.టి.యు.లో చేరారు. మన నాయకత్వంలో 9రోజులు సమ్మె చేసి హక్కులను తిరిగి సాధించుకున్నారు.

విజయనగరం - చందన బ్రదర్స్ బట్టలషాపు 4నెలలుగా మూసివేసి 56మంది కార్మికుల తొలగించింది. దీనికి వ్యతిరేకంగా, పోలీసుల లాఠీఛార్జీలు, అక్రమ కేసుల బనాయింపు, అరెస్టులను తట్టుకొని పలు పోరాటాలు నిర్వహించారు. చివరకు జిల్లాకలెక్టరు చొరవతో ఒక ఒప్పందం కుదిరింది. తొలగించిన వారిలో 15మందిని వెంటనే పెట్టుకొని, మిగిలిన 25మందిని తరువాత చేర్చుకుంటారు.

ఈ కాలంలో నికరంగా చేసిన కృషి వల్ల గ్రామ సేవకులు, మధ్యతరగతి ఉద్యోగులు, అనియత విద్య, ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాలు, డ్వాక్రా మహిళలు వంటి కొత్త తరగతుల్లో సి.ఐ.టి.యు. ప్రభావం పెరిగింది. అంగన్‌వాడీ యూనియన్ బలపడింది. గత మహాసభ నాటికి 6500 ఉన్న సభ్యత్వం నేడు 23082కు చేరింది. గతంలో 19 జిల్లాల్లో 150 ప్రాజెక్టుల్లో మాత్రమే ఉండగా నేడు అన్ని జిల్లాల్లోని 209 ప్రాజెక్టులకు విస్తరించింది. ఈ కృషి వల్ల సూపర్‌వైజర్స్ యూనియన్ స్థాపించాం.

## కార్మిక-కర్షక మైత్రి

సమాజంలో దోపిడి పీడలను అంతం చేయాలని సి.ఐ.టి.యు. కృషి చేస్తున్నది. కాని ఇతర పీడితవర్గాలను, ముఖ్యంగా వ్యవసాయ కార్మికులు, రైతాంగాన్ని కలుపుకోనిదే సమసమాజ స్థాపన అసాధ్యమని సి.ఐ.టి.యు. విశ్వాసం. గ్రామీణ ప్రాంతాల్లో ఎస్.సి., ఎస్.టి., బి.సి.ల ఆర్థిక సమస్యలతోపాటు, కుల వివక్షతకు వ్యతిరేకంగా సి.ఐ.టి.యు పోరాడుతున్నది. గత 4 సంవత్సరాలుగా వ్యవసాయ కార్మికుల పోరాటాలకు ఆర్థిక సహాయం అందించటం, వారి పోరాటాల్లో కార్మికులను ప్రత్యక్షంగా పాల్గొనేలా చేయటంలో సి.ఐ.టి.యు. విజయవంతమైంది.

గత 2 సం॥లలో వ్యవసాయ కూలి సంఘం రాష్ట్ర కేంద్రానికి సుమారు లక్ష రూపాయలు నిధి వసూలు చేసి సి.ఐ.టి.యు అందజేసింది. ఈ రెండు సందర్భాలలోను 3 లక్షలకు పైగా కరపత్రాలు వేసి పంచాం. కూలి పోరాటాలలో, క్యాంపెయిన్‌లో సిఐటియు కార్యకర్తలు స్వయంగా 1997లో 100 మంది, 1998లో 1271 మంది పాల్గొన్నారు. 1998లో వీరికి సంఘీభావంగా 12 జిల్లాలలో నిర్వహించిన సదస్సులలో 1993 మంది మేధావులు, మధ్యతరగతి ఉద్యోగులు, దళిత సంఘాల నాయకులు, కార్యకర్తలను, వ్యవసాయ కూలిపోరాట శ్రేయోభిలాషులను సమీకరించడం జరిగింది. 3,08,000 కరపత్రాలు వేసి పంచారు.

విశాఖ జిల్లా పెందుర్తి మండలంలో 3 గ్రామాలలో వ్యవసాయ కూలీలు భూపోరాటం చేసారు. ఈ పోరాటంతో కార్మికులు మమేకమై సహకరించేవిధంగా సి.ఐ.టి.యు. కృషిచేసింది. ఆర్థికంగా ఆదుకోవటంతోబాటు, అన్ని పోరాట కార్యక్రమాలలో ప్రత్యక్షంగా కార్మికులను సమీకరించింది. ఈ పోరాటం ద్వారా 300 ఎకరాల భూమి సాధించిన కూలీలు, దళితులతో ఆ ప్రాంతం కార్మికవర్గంతో మైత్రి పెరిగింది.

ప్రకాశం జిల్లాలో ఇంకొల్లు మండలంలో దళితులు బంజర భూములనాక్రమించుకొన్న సందర్భంగా వారికి మద్దతుగా రంగంలోకి దిగిన సి.ఐ.టి.యు. నాయకుడిని కేసుల్లో ఇరికించి దళితులతో పాటు నెల్లూరు జైలుకు పంపారు.

రైతు రక్షణ యాత్ర సందర్భంగా రాష్ట్రంలో రైతాంగ ఆందోళనకు మద్దతుగా 1,30,500 కరపత్రాల వేసి పంచారు.

కుల వివక్షతా వ్యతిరేక పోరాట కమిటీలో భాగంగా ఈ కాంపెయిన్‌లో

సిఐటియు కార్యకర్తలు చురుకుగా పాల్గొన్నారు. రాష్ట్ర వ్యాపితంగా ఈ కాంపెయిన్‌లో సిఐటియు కార్యకర్తలు 1731 మంది పాల్గొన్నారు. నవంబరు 16న కలెక్టరు కార్యాలయం వద్ద పికెటింగ్‌లో అధిక సంఖ్యలో కార్మికులను సమీకరించారు.

## సంఘటిత శక్తిగా ఎదుగుతున్న సి.ఐ.టి.యు

గత మహాసభ అనంతరం అదనంగా 322 సంఘాలు, 88,482 సభ్యత్వం పెరిగింది. ఈ పెరుగుదల ప్రధానంగా అసంఘటిత రంగంలో జరిగింది. 1996లో అసంఘటిత రంగంలో జరిగిన కృషి మూలంగా 30,000 కొత్త సభ్యత్వం పెరిగింది. సభ్యత్వం బాగా పెరిగిన మరో రంగం అంగన్‌వాడి. 6500 నుండి ఈ రంగం సభ్యత్వం 23082కు పెరిగింది. మధ్య తరగతి, ప్రభుత్వరంగం, గ్రామసేవకులు, అనియత విద్య తదితర రంగాలలో సి.ఐ.టి.యు. సపోర్టు బేస్ కూడా విస్తరించింది. 1996లో అసంఘటితరంగం సమస్యల మీద కాంపెయిన్స్ తర్వాత ప్రత్యేకంగా సభ్యత్వ కాంపెయిన్ నిర్వహించటం సభ్యత్వం పెంపుదలకు తోడ్పడింది.

గత మహాసభ నాటికి రంగారెడ్డి, నిజామాబాద్ జిల్లాల్లో సి.ఐ.టి.యు. సభ్యత్వం లేదు. నేడు రాష్ట్రంలోని అన్ని జిల్లాలలో సి.ఐ.టి.యు. సభ్యత్వం ఉన్నది. 124 పారిశ్రామిక/కార్మిక కేంద్రాలనుండి 219కి, 182 మండలాల నుండి 442కు విస్తరించింది. విశాఖ, హైదరాబాద్, మెదక్, అనంతపురం, విజయనగరం, ప్రకాశం, కృష్ణా వంటి జిల్లాల్లో ఈ కాలంలో గణనీయమైన సంఖ్యలో కొత్త ప్రాంతాలకు విస్తరించాం.

విస్తరణ దృక్పథాన్ని, నూతన వరవడిని, వివిధ కమిటీలు నాయకుల పని విధానాన్ని సరిచేయడానికి మహాసభ కృషి చేసింది. మొత్తం నివేదికపై చర్చతోపాటు ఈ 3 అంశాలపై మొత్తం ప్రతినిధులు చర్చల్లో పాల్గొన్నారు. హాజరైన మొత్తం 600 మంది ప్రతినిధులనూ చర్చల్లో భాగస్వాములను చేయటం ఈ సభ ప్రత్యేకత.

ఈ చర్చలకు ప్రధాన కార్యదర్శి కా॥బి.వి.రాఘవులు సమాధానం చెబుతూ అనేక నిర్మాణాత్మక సూచనలు చేశారు. కొన్ని జిల్లాల్లో కొనసాగుతున్న తప్పుడు ధోరణులను కొందరు నాయకుల పొరపాటు పని పద్ధతులను సునిశితంగా విమర్శిస్తూ వాటిని సరి చేసుకోవాల్సిన ఆవశ్యకతను వివరించారు.

వస్తున్న అవకాశాలన్నింటిని వినియోగించుకుని సి.ఐ.టి.యు అభివృద్ధి చెందాలంటే రానున్న కాలంలో కార్యకర్తల శిక్షణకు అత్యంత ప్రాధాన్యత నిచ్చి కృషి చేయాలని ఆయన సూచించారు. అనంతరం కా॥ ఎస్.వీరయ్య, ప్రధాన కార్యదర్శిగా, కా॥ ఎమ్.ఎ.గపూర్ అధ్యక్షులుగా 18 మంది ఆఫీసు బేరర్స్‌గాను, 101 మంది వర్కింగ్ కమిటీ సభ్యులుగాను, 219 మంది రాష్ట్ర కౌన్సిల్ సభ్యులుగాను ఎన్నికైనారు. కౌన్సిల్‌లో 26మంది, కమిటీలో 13మంది, ఆఫీసు బేరర్స్‌లో ఇద్దరు మహిళలున్నారు. వీరుగాక కోఆప్ట్ చేసుకోవాల్సిన 24మందిలో మరో 7మంది ఉంటారు. వివిధ జిల్లాల్లో శ్రామిక మహిళారంగానికి కేటాయించిన మహిళా హోల్‌టైమర్లందరు కమిటీలోకి ఎన్నుకోబడ్డారు. నాయకత్వస్థానంలో శ్రామిక మహిళలకు గతంలో కన్నా ప్రాతినిధ్యం పెరిగింది.

మహాసభకు 600మంది ప్రతినిధులు హాజరుకవల్సి యుండగా 587 మంది హాజరయ్యారు. వీరిలో 77మంది శ్రామిక మహిళలు, 50మంది మధ్యతరగతి ఉద్యోగులు.

మహాసభలో కేరళ ముఖ్యమంత్రి కా॥ ఇ.కె.నయనార్ హాజరై ఉత్తేజకరమైన ఉపన్యాసం ఇచ్చారు.

చివర్లో కా॥ పాంథే చర్చలను సమీక్షిస్తూ ప్రసంగించారు. (దీన్ని విడిగా ఇస్తున్నాం)

1970లో సి.ఐ.టి.యు. ఏర్పడ్డనాటి నుండి 29 సం॥లు ముఖ్య బాధ్యతల్లో ఉండి వృద్ధాప్యం వల్ల రిలీవ్ అయిన కా॥ నండూరి ప్రసాదరావు, కా॥ పర్సా సత్యనారాయణ, కా॥ బాలాజీదాస్ గార్లకు మహాసభ ఘనంగా వీడ్కోలు పలికింది. వారి సేవలకు ధన్యవాదాలు చెప్పింది. అఖిల భారత కేంద్రం బాధ్యతల్లో రిలీవ్ అయిన కా॥హేమలత గారికి కూడా మహాసభ అభినందనలు తెలియజేసింది.

మహాసభల ముగింపు రోజైన 12వ తేదీన అనంతపురం పట్టణంలో మహాప్రదర్శన, బహిరంగ సభ జరిగాయి. 15వేలకు పైగా కార్మికులు పాల్గొన్నారు. 'అప్ అప్ సోషలిజం - డౌన్ డౌన్ కేపిటలిజం', 'సి.ఐ.టి.యు. జిందాబాద్' వంటి నినాదాలతో కష్టజీవులు కదంతొక్కారు. ఈ ప్రదర్శనలో మహిళలు పెద్దసంఖ్యలో పాల్గొనడం విశేషం. ప్రదర్శన అనంతరం జరిగిన బహిరంగ సభలో కేరళ ముఖ్యమంత్రి కా॥ ఇ.కె.నయనార్, సి.పి.ఐ.(ఎం) రాష్ట్ర కార్యదర్శి కా॥బి.వి.రాఘవులు, సి.ఐ.టి.యు. అఖిల భారత ఉపాధ్యక్షులు కా॥ నండూరి ప్రసాదరావు, అఖిల భారత కార్యదర్శి కా॥హేమలత, సి.ఐ.టి.యు. నూతన అధ్యక్షులు కా॥ఎం.ఎ.గఫూర్, ప్రధాన కార్యదర్శి కా॥ ఎస్.వీరయ్య, అనంతపురం జిల్లా రైతు సంఘం ప్రధాన కార్యదర్శి కా॥ విశ్వేశ్వరరెడ్డి గార్లు ప్రసంగించారు. సి.ఐ.టి.యు. జిల్లా అధ్యక్షులు కా॥ ఓబుళకొండారెడ్డి గారు ఈ సభకు అధ్యక్షత వహించారు. ★

### పారిశ్రామిక వినిమయ ధరల సూచీ
**(1982-100 పాయింట్ల పునాదిపై)**

| | అక్టోబర్ | నవంబర్ | ఫాక్టర్ |
|---|---|---|---|
| ఆలిండియా | 433 | 438 | 4.93 |
| హైదరాబాద్ | 397 | 399 | 5.23 |
| గుంటూరు | 418 | 421 | 5.60 |
| గూడూరు | 441 | 450 | 4.33 |
| విశాఖపట్నం | 415 | 420 | 2.48 |
| వరంగల్ | 423 | 426 | 2.36 |
| కొత్తగూడెం | 453 | 464 | 3.25 |
| రాష్ట్ర సిరీస్ | | | |
| విజయనగరం | 363 | 370 | - |
| రాజమండ్రి | 398 | 403 | 2.55 |
| విజయవాడ | 398 | 402 | - |
| ఆదోని | 409 | 413 | 2.33 |
| ఎస్.ఎస్.బి. | 408 | 414 | 2.52 |
| ఎం.జి.పి. | 405 | 408 | 2.49 |

6A

8C

Estd.:1952 Phone:23469




# L.I.C. Employees' Co-operative Bank Ltd.

(Regd. No. 15 NN)

"Jeevan Prakash" Building - Kennedy Road - **Machilipatnam**

## RATES OF INTEREST ON TERM DEPOSITS w.e..f. 13-07-98

### FIXED DEPOSITS

| | | | |
|---|---|---|---|
| From 15 days | to | 29 days | 5 % |
| From 30 days | to | 6 months | 8 % |
| Above 6 months | upto | one year | 9 % |
| Above 1 Year | upto | Two Years | 11 % |
| Above 2 Years | upto | 3 Years | 12 % |
| Above 3 Years | upto | 5 Years | 13 % |
| Above 5 Years | .... | .... | 14 % |

- * Interest will be paid at quarterly and monthly rates.
- * Interest upto Rs.13,000/- is exempted from Income Tax.
- * Deposits are protected by Deposit Insurance and Credit Guarantee Corporation.
- * Lockers and Gold Loan facility available.
- * Loans on NSC and Kisan Vikas Patra available.
- * Bank Computerised for quick & accurate service

### Board of Directors

**Guttikonda Subba Rao**
President

**V.Koteswara Rao**
Treasurer

**DIRECTORS**

N.Narayana Rao, P.Mohana Rao, G.Kishore Kumar, A.Babu Rao, M.Siva Prasad, T.L.R.Prasad Rao, P.B.R.V.Prasada Rao, Secretary

# కార్మికవర్గ ఐక్యతకు ఎంతో కీలకమైన మహాసభలు

**సి.ఐ.టి.యు. ఆంధ్రప్రదేశ్ 8వ మహాసభల ముగింపు సందర్భంగా కా॥ ఎం.కె.పాంథే**

నేను మొదటి రోజు ప్రారంభసభ సందర్భంగా చెప్పినట్లు ఈ మహాసభలు కార్మికవర్గ ఐక్యతకు చాలా కీలకమైనవి.

ప్రధాన కార్యదర్శి నివేదికను ప్రతినిధులు ఏకగ్రీవంగా ఆమోదించారు. కొత్త కౌన్సిల్ ఏకగ్రీవంగా ఎన్నిక అయింది.

ఆంధ్రప్రదేశ్‌లో సి.ఐ.టి.యు. సాధించిన విజయాలు మీ చర్చల్లో వ్యక్తమయినాయి. ఈ రాష్ట్రంలో సి.ఐ.టి.యు.ని విస్తరించడంలో మీరు విజయవంతమైనారు. సభ్యత్వం పెద్దఎత్తున పెరిగింది. సభ్యత్వం పెరుగుదల రేటులో ఆంధ్రప్రదేశ్ మొదటి స్థానంలో ఉంది.

మీ రాష్ట్రంనుండి రెగ్యులర్ రిపోర్టులు ఆల్ ఇండియా కేంద్రానికి వస్తున్నాయి. నిర్మాణం విషయంలో నిర్దిష్టమైన చర్యలు మీరు తీసుకొన్నారు. రాజకీయ శిక్షణలో కూడా పథకం ప్రకారం మీరు పనిచేశారు. సాధించిన విజయాలనుంచి వచ్చిన ఉత్సాహం మరిన్ని విజయాలకు దారితీస్తుంది. ఇప్పుడు 2,20,000గా ఉన్న సభ్యత్వం మరింత పెంచాలని పిలుపునిస్తున్నాను. రాబోయే ఆల్ ఇండియా సి.ఐ.టి.యు. మహాసభల నాటికి 3,00,000 సభ్యత్వానికి చేరుకోవాలని కోరుతున్నాను. చేరితీరుతారనే నమ్మకం నాకు ఉంది.

అయితే ఇన్ని విజయాలను సాధించినా కార్మికుల సంఖ్యతో పోలిస్తే మనం చేయాల్సిన కృషి చాలా ఉందని అర్థమౌతుంది. ఈ రాష్ట్రంలో అనేక పెద్ద పబ్లిక్ రంగ సంస్థలు, ప్రైవేటురంగ సంస్థలు ఉన్నాయి. ట్రేడ్ యూనియన్‌హక్కులపైనా, లౌకికవాదం పైనా, కులప్రాతిపదికన జరిగే దాడులను మనం అడ్డుకోవాలి. ఎక్కడ సి.ఐ.టి.యు. బలంగా ఉందో అక్కడ ఐక్య ఉద్యమాలు బలపడతాయి. ప్రతినిధులందరూ వారివారి ప్రాంతాలకు వెళ్ళిన తరువాత మహాసభనిర్దేశించిన లక్ష్యాలను మరింత పట్టుదలతో సాధించేందుకు కృషిచేయాలి. ప్రపంచ కార్మికోద్యమ చరిత్రనుండి మనం నేర్చుకునేది ఏమిటంటే ప్రతి ఒక్క పోరాటం విజయాలను చేకూర్చకపోవచ్చు. కొన్నింటిలో విజయాలు వస్తాయి. కొన్నింటరావు. మనం సాధించిన విజయాలనుండే గాకుండా, మన బలహీనతల నుండి కూడా పాఠాలు నేర్చుకోవాలి. పోరాటపు ఎత్తుగడలను మనం నేర్చుకోకుంటే మన పోరాటం విజయవంతం కాని పరిస్థితులు వస్తాయి. వాస్తవాలను లెక్కలోకి తీసుకోకుండా పోరాడితే దానివలన ఫలితాలు రావు. వాస్తవాలను కార్మికుల ముందుపెట్టాలి.

బి.టి.ఆర్. ఉన్న రోజులలో బెంగాల్ టెక్స్‌టైల్ కార్మికుల పోరాటం జరిగింది. పోరాటం చాలా రోజులు సాగింది. కార్మికులు తాము పోరాటాన్ని కొనసాగించే పరిస్థితుల్లో లేమని చెప్పారు. జనరల్‌బాడీ మీటింగ్ పెడితే, పాక్షికంగా రిట్రెంచ్‌మెంట్‌కు ఒప్పుకోవాలని నిర్ణయం వచ్చింది. కార్మికుల నిర్ణయాన్ని మనం శిరసావహించాలని బి.టి.ఆర్ చెప్పారు. ఆ పోరాటం పూర్తి విజయంతో ముగియలేదు.

పాత పోరాటాల గురించి తెలుసుకొని సరియైన ఎత్తుగడలు వేసుకోవాలి. అదే సమయంలో కార్మికులను ఊగిసలాటల నుండి రక్షించుకోవాలి.

### ఐక్య సంఘటన ఎత్తుగడలు

ఒకసారి బి.టి.ఆర్. అడిగారు. "ఐక్య పోరాటం జరిగింది. సమ్మె అయిన తరువాత కార్మికులు ఎక్కడ ఉన్నారు?" అని. "వారి యూనియన్ వద్ద వారే ఉన్నారు". ఇతర యూనియన్ల వెనక ఉన్న కార్మికులను ఆకర్షించడం ఐక్య ఉద్యమ లక్ష్యం. ఇతర యూనియన్ల వద్ద ఉండే కార్మికులను మన వద్దకు వచ్చే ప్రయత్నాలు చేయకుంటే అది ఐక్య ఉద్యమంలో చేసే తప్పు. ఇతర కార్మికులను మన జండా కింద ఐక్యం చేయడం వర్గ ఐక్యతకు చాలాముఖ్యం. ఈ కోణంనుండి మన బాధ్యతలను నెరవేర్చాలి.

11 డిసెంబరు-98 నాటి సమ్మెలో బీహార్‌లో ఎ.ఐ.టి.యు.సి. సమ్మెలో పాల్గొనలేదు. కార్మికులు సి.ఐ.టి.యు. లో జాయిన్ అయినారు. సమ్మెలో పాల్గొన్నారు. అదే సమ్మెలో బెంగాల్ ఐ.ఎన్.టి.యు.సి. పాల్గొంది. దానికి కారణం ఏమిటి? సి.ఐ.టి.యు. చేసిన క్యాంపెయిన్ ఇతర కార్మికుల్లో కూడా చొచ్చుకు పోయింది.

పెన్షన్‌పై జరిపిన పోరాటంలో గతంలో ఐ.ఎన్.టి.యు.సి., హెచ్.ఎమ్.ఎస్., బి.ఎమ్.ఎస్., ఎ.ఐ.టి.యు.సి. మనతో కలిసిరాలేదు. తరువాత ప్రభుత్వం మమ్మల్ని మోసంచేసిందని చెప్పడం మొదలెట్టారు. సి.ఐ.టి.యు. చెప్పింది "మేం మోసపోయే పరిస్థితే లేదు. ఎందుకంటే ప్రభుత్వ పెన్షన్ స్కీంలో చాలా లోపాలున్నాయి అని మేం ముందే చెప్పాం.'' ఇతర యూనియన్లు ఇప్పుడు మన వద్దకు 'కలసి పోరాడదాం' అని వస్తున్నాయి. పెన్షన్ స్కీమ్‌కు ప్రత్యామ్నాయానికై పోరాడాలని మనతో కలుస్తామంటున్నారు. మన కేసు సుప్రీం కోర్టులో ఉంది. పెన్షన్‌పై ఆప్షన్ ఇచ్చే అవకాశం ఉంది.

సి.ఐ.టి.యు. తీసుకొన్న సరియైన విధానం ఇతర కార్మికులను మనవైపు ఆకర్షిస్తోంది. ఐక్యపోరాటాలలో ఏ.ఐ.టి.యు.సి., హెచ్.ఎం.ఎస్. ఒక్కోసారి ఊగిసలాట ధోరణిని ప్రదర్శిస్తుంటాయి. సైద్ధాంతికంగా క్యాంపెయిన్ చేస్తేనే ఈ ఊగిసలాటలనుండి కార్మికులను రక్షించగలం. ఇది మీరు చేపట్టాలి.

ప్రైవేటీకరణ వ్యతిరేక క్యాంపెయిన్, పబ్లిక్ రంగ పరిరక్షణకై పోరాటం, అసంఘటితరంగంలో కార్మికులవేతనాలను పరిరక్షించడం వంటి విషయాలపై పనిచేయాలి. శ్రామికమహిళల్లో కృషి పెంచాలి. క్రొత్తక్యాడర్ వారి నుండి అభివృద్ధి చేయాలి. యువ కార్మికులకు పోరాటాల అనుభవం ఉండదు. ప్రభుత్వం, యాజమాన్యాలు వారిని ప్రలోభ పెట్టేందుకు ప్రయత్నిస్తాయి. దీనిపై శ్రద్ధ వహించాలి. ఎస్.సి.,ఎస్.టి. అసోసియేషన్ల

పేరుమీద కార్మికులను వేర్పాటు చేసే ఉద్యమాలు వస్తున్నాయి. ఇవి కార్మికులను చీల్చేందుకు ఉపయోగపడుతున్నాయి. కులతత్వాన్ని ట్రేడ్ యూనియన్ల నుండి దూరంగా ఉంచాలి. పెద్ద సంఖ్యలో చిన్న చిన్న యూనియన్లు సి.ఐ.టి.యు.కి అనుబంధమౌతున్నాయి. వీరిని నిర్మాణంలో ఇముడ్చుకోవాలంటే కేడర్ అభివృద్ధి చాలా అవసరం.

ప్రజాసంఘాల జాతీయ వేదిక (ఎన్.పి.ఎం.ఓ.) కార్యక్రమాల్లో, రైతుసంఘం, వ్యవసాయ కార్మికసంఘం, విద్యార్థి, యువజన, మహిళా సంఘాలతో ఎక్కువ కో ఆర్డినేషన్ పెంచుకోవాలి. అప్పుడే ఎన్.పి.ఎం.ఓ. కార్యక్రమాలు పెద్ద ఎత్తున అమలు అవుతాయి. ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా అనేక యూనియన్లు నడుంకడ్తున్నాయి. ఎక్కువ యూనియన్లను కలుపుకుంటే ప్రభుత్వ విధానాలను పెద్ద ఎత్తున నిలవరించవచ్చు. అందువలన ఎక్కువ యూనియన్లతో ఐక్యపోరాటాలు నిర్మించాలి.

ఎన్.పి.ఎం.ఓ. కార్యాచరణతో బాటు, స్వతంత్ర కార్యాచరణలో భాగంగా సి.ఐ.టి.యు. 2.2.99న నిరసన ప్రదర్శనలకు పిలుపు నిచ్చింది. వాటిని విజయవంతంచేయాలి. కేంద్రంలో ఉన్న బి.జె.పి. సంకీర్ణ ప్రభుత్వ పని విధానం చాలా తక్కువ స్థాయిలో ఉంది. రాజకీయ ఆర్థిక పరిస్థితి ఒడిదుడుకుల్లో ఉంది. పెట్టుబడిదారీ విధానం ప్రపంచ వ్యాప్తంగా సంక్షోభంలో ఉంది. దీనికి పెట్టుబడి దారీ విధానంలో పరిష్కారం లేదు.

కార్మికవర్గాన్ని ఐక్యంచేయడం, రోజువారీగా వారికి సిద్ధాంత పరమైన శిక్షణ ఇవ్వడం, కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన, మహిళా సంఘాల మధ్య బంధాన్ని పటిష్టం చేయడం ఈ నాడు ట్రేడ్ యూనియన్ రంగంలో మన ముందున్న కర్తవ్యాలు. మీరు మీ మహా సభలో సరియైన నిర్ణయాలు తీసుకున్నారు. వాటిని అమలు చేయండి.

చివరిగా, ఒకటిరెండు విషయాలు. డా॥ హేమలతగారిని ఆల్ ఇండియా కేంద్రంలో బాధ్యతలకై పంపడానికి మీరు సహకరించారు. అందుకు కృతజ్ఞతలు. రాబోయే సి.ఐ.టి.యు. ఆల్ ఇండియా మహాసభలు మీ రాష్ట్రంలో జరగాలని కోరుకుంటున్నాను. దానికి మీరు సమర్థులని కూడా నాకు తెలుసు.

మీ కార్యక్రమాల్లో విజయం సాధించాలని కోరుకుంటున్నాను! ★

# సి.ఐ.టి.యు. మహాసభల స్వాగతోపన్యాసం (సంక్షిప్త పాఠం)

అందరికీ నమస్కారం. హృదయపూర్వక స్వాగతం!

అనంతపురం జిల్లా సాహితీ సంప్రదాయాలకు నెలవైనప్పటికీ కరువు జిల్లాగా పేరొందింది. దేశంలోనే రెండవ అత్యల్ప వర్షపాతం కలిగిన జిల్లా, పారిశ్రామిక వంతం కాకపోయినా, పరిమిత వర్షపాతంలో ఇక్కడి రైతులు వాణిజ్య పంటలను పండిస్తున్నారు. జిల్లాలోని వజ్రకరూర్, రామగిరి ప్రాంతాల్లో నేటికీ బంగారు, వజ్రగనుల తవ్వకం సాగుతోంది. గాలి మరల ద్వారా విద్యుత్ తయారీ పెద్ద ఎత్తున జరగడం ఒక ప్రత్యేకత. ప్రపంచంలోకెల్లా పెద్దదైన మర్రిచెట్టు ఇక్కడ ఉన్నది.

లేపాక్షి దేవాలయం, మహానంది విగ్రహం, 'గూటి'లోని కోటి కట్టడాలు శిల్పకళా నైపుణ్యాన్ని చాటి చెపుతున్నాయి. ఆసియాలో కెల్లా అత్యంత పెద్ద సహకార నూలుమిల్లు గుంతకల్ నూలుమిల్లు, పట్టు పరిశ్రమకు పేరొందిన ధర్మవరం, శ్రీ కృష్ణదేవరాయ విశ్వ విద్యాలయం జిల్లా ఖ్యాతిని ఇనుమడింపజేశాయి.

ఇంతటి ప్రాముఖ్యత కలిగిన జిల్లాలో ఈ మహాసభలు జరుపుకోవడం నిజంగా మా అందరికీ గర్వకారణం.

మనదేశం అనేక సమస్యలను ఎదుర్కొంటున్న నేపథ్యంలో ఈ మహాసభ జరుగుతోంది.

ఇన్సూరెన్స్‌రంగ ప్రైవేటీకరణ, పేటెంట్ చట్టంలో మార్పులు వంటి వాటిని వ్యతిరేకించి పోరాడడటంలో సి.ఐ.టి.యు. చేస్తున్న కృషి అభినందనీయం. అయితే కేవలం ఏ ఒక్క సంఘమో ఈ మొత్తం భారాన్ని మోయరాదు. కార్మికవర్గం అంతా ఏకమై వారి వర్గదృక్పథంలో పనిచేస్తూ, పాలకవర్గ కుట్రలను బహిర్గతం చేయాలి. ఈ కార్యం సాధించాలంటే కా॥బి.టి.రణదివె చెప్పినట్లుగా జాతీయ కార్మిక సంఘాలన్నీ ఒకే ఫెడరేషన్‌గా ఏర్పడాలి.

పాలకవర్గ ప్రజావ్యతిరేక ఆర్థిక విధానాలను, మతతత్వ ఎజెండాను సమర్థవంతంగా ఎదుర్కోవడానికి ఐక్య కార్మికోద్యమం ఒక్కటే సరైన ఆయుధం.

ఇంత త్వరితంగా మారిపోతున్న పరిస్థితులలో కేవలం సి.ఐ.టి.యు. వంటి అంకితభావంతో పనిచేసే కార్మిక సంఘాలు మాత్రమే కార్మికవర్గాన్ని ముందుండి నడిపించి రక్షించగలుగుతాయి.

ఒకపక్క ప్రభుత్వ కార్మిక వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా పోరాడుతూనే, మరోపక్క కనీస వేతన చట్టం, కార్మిక నష్టపరిహార చట్టం, వేతనాల చెల్లింపు చట్టం వంటి కార్మికసంక్షేమ చట్టాలను అమలు చేయాలని కూడా సి.ఐ.టి.యు. ఆందోళన చేయడం ముదావహం. అనంతపురం జిల్లాలో అంగన్‌వాడీ, బీడి, గ్రామ సేవకులు, విద్యుత్, మున్సిపాలిటీ వంటి అసంఘటిత రంగ కార్మికుల సమస్యల పట్ల కేంద్రీకరించి పనిచేసిన సి.ఐ.టి.యు. అందరి మన్ననలు అందుకున్నది. జిల్లా మొత్తంలో అతి తక్కువ కాలంలో అంకిత భావంతో పనిచేసి, ఒక నమ్మదగిన కార్మిక సంఘంగా సి.ఐ.టి.యు. కార్మికులలో స్థానం సంపాదించగలిగింది.

శక్తివంతమైన ఐక్య కార్మికోద్యమాలు మాత్రమే చరిత్రలో అనేక మార్పులను తెచ్చాయనే విషయాన్ని మనం మరిచిపోకూడదు. అందుకే మన దేశంలో మరల చరిత్ర పునరావృతం కానివ్వండి.

దేశంలో అత్యధిక సంఖ్యాకులుగా వున్న పేదవారిని రక్షించలేకపోతే, కొద్దిమందిగా వున్న ధనవంతులను కూడా తాము రక్షించలేమనే విషయాన్ని ప్రభుత్వం గుర్తించేలా కార్మికవర్గం ముందు పీఠాన నడవాలని కోరుకుంటున్నాను.

ఈ మహాసభలో మీరు ఫలప్రదమైన చర్చలు జరపాలని, దేశ సంక్షేమంకోసం, కార్మికవర్గ ప్రయోజనాలకోసం మీ ఉద్యమాన్ని ముందుకు తీసుకొనిపోయే రీతిలో అవి వుండాలని, ఆహ్వాన సంఘం తరపున ఆశిస్తున్నాను.

విప్లవాభినందనలతో శలవు తీసుకుంటున్నాను.

ప్రొ॥ ఎం.డి.గౌస్
ఆహ్వానసంఘం అధ్యక్షులు

8C

కంచి సొసైటీ పట్టు చీరల మెగా ఎ.సి. షోరూమ్

శుభాకాంక్షలతో

# శ్రీ శంకర్ సిల్క్స

ఫోన్: 34452, 35702 (రెసిడెన్స్)

కంచి సొసైటీ పట్టు చీరల మెగా ఎ.సి. షోరూమ్

## శ్రీ శంకర్ సిల్క్స

లేడీస్ అండ్ జెంట్స్ క్లాత్ షోరూమ్,

పద్మశ్రీ టాకీస్ ప్రక్కన, భీమవరం-1

---

ఫోన్: 23409 (షాప్),
23926 (రెసిడెన్స్)



వివాహాది శుభకార్యములకు కావలసిన పట్టు, ఫ్యాన్సీ, చేనేత జరీ చీరెలు, ఖద్దరు శిల్కు, షర్టింగులు, నిత్యావడకమునకు కావలసిన అన్ని రకముల మిల్లు వస్త్రములు సరసమైన ధరలకు లభించును

# శ్రీనివాస క్లాత్ ఎంపోరియం

**హోల్‌సేల్ & రిటైల్ కట్‌పీసెస్ క్లాత్ మర్చంట్స్**

పి.పి.రోడ్, భీమవరం-2

ప్రొప్రయిటర్: కచ్చాల అప్పారావు

# కదిరి పురపాలక సంఘం

శ్రీ సి.ఎ.రసూల్‌సాబ్,
చైర్మన్

## అభివృద్ధి పనులు

శ్రీ బి.అజయ్‌కిషోర్
కమీషనర్

| | |
|---|---|
| 1. జనరల్‌ఫండ్స్ ద్వారా వీధిలైట్లు, స్తంభాలకు | : 3,00,000 |
| నీటి పథకం నిర్వహణకు | : 8,12,000 |
| రోడ్లు, కాలువలు, మోరీలు నిర్మాణం | : 3,00,000 |
| 2. గ్రాంటు పనులకుగాను పార్క్ కాంపౌండ్‌లకుగాను, సిమెంట్ రోడ్లకు | : 2,50,000 |
| 3. కరువు నివారణ పథకం కింద నీటి సరఫరా | : 10,00,000 |
| (సైదాపురం, గొల్లమ్మ, మండపం, ఇందిరానగర్, కుటాగుళ్ళ, గజ్జలరెడ్డిపల్లి కాలనీలకు 12 బోరు బావులకు ) | |
| నీటి సరఫరా ట్యాంకుల ద్వారా | : 3,00,000 |
| 4. ఎం.పి. నిధుల కింద నీటి సరపఫరాలకు | : 10,00,000 |
| పైపులైన్లకు : 8,00,000 బోర్ల బావులకు : 2,00,000 | |
| కొత్త హరిజనవాడ, రాజేంద్రప్రసాద్ వీధి, అడపాల వీధి, గజ్జలరెడ్డిపల్లి కాలనీ, శివాలయం వెనుక, కుటాగుళ్ళ | |
| 5. ఎన్.ఆర్.వై.పనులు | |
| సిమెంటు రోడ్లు | : 4,30,000 |
| కంకర, తారు రోడ్లకు | : 1,50,000 |
| కాలువలు, ఆర్.ఆర్.మేషనరి డ్రెయిన్‌కు (60మీ) | : 2,00,000 |
| 6. స్కూల్ బిల్డింగ్‌కు గ్రాంటు - మున్సిపల్ హైస్కూల్ | |
| 2.58ల హిందూపురం క్రాసు 4 రూంలు, 1.42ల చంద్రవదన మెహియూర్ స్కూలు | : 6,40,000 |
| 7. వరద నివారణ నిధులు | : 15,77,100 |
| బ్రిడ్జి నిర్మాణానికి : 10,00,000, తారు రోడ్లకు : 5,77,100 | |
| కల్లంగుడి బజారు, గజ్జలరెడ్డిపల్లి కాలనీ | |
| 8. ప్రధాన మంత్రి పట్టణ సమగ్ర పేదరిక నిర్మూలన పథకం (మురికివాడలలో) 95-96, 96-97 రోడ్లు, కాలువలకు | : 31,00,000 |
| (గాంధీనగర్, కొత్తహరిజనవాడ, కుటాగుళ్ళు, మూర్లిపల్లి, ఎస్.టి.కాలనీ, మశానంపేట ఏరియా, తుమ్మలరోడ్డు, | |
| జోక్‌పాలెం (10వ వార్డు) పై ప్రాంతాలలో నీటి సరఫరాకు పిల్లవంకలో బోర్లు వేసి పంపింగ్ ద్వారా పట్టణానికి నీటి సరపరా | : 28,00,000 |
| కొత్తటాంకు నిర్మాణానికి | : 14,00,000 |
| మోటార్లకు బోర్లకు పంపు రూములు పైపులైన్ కనెక్షన్‌కు లక్ష్య గ్యాలన్ల కెపాసిటీ గల కొత్త ట్యాంక్ | : 7,00,000 |
| 9. పె.ని.ప.నిధులు కింద | : 5,00,000 |
| నీటి సరఫరా లేని ప్రాంతంలో పైపులైను ఏర్పాటుకు అడపాల స్ట్రీట్, న్యూహెచ్.డబ్ల్యు.అమీన్‌నగర్, ఓల్డ్‌కుమార్ స్ట్రీట్, | |
| త్యాగరాజ్ స్ట్రీట్, రాణిపేట, ఓల్డ్ పంచాయతీ ఆఫీస్ స్ట్రీట్, రాజేంద్రప్రసాద్ స్ట్రీట్, కుటాగుళ్ళ, గజ్జలరెడ్డిపల్లి కాలనీ. | |
| 10. స్పెషల్ కాంపొనెంట్ స్కీము కింద పాత హరిజనవాడ కొత్తహరిజనవాడ నీటి సరఫరాకు | : 1,50,000 |
| 11. కరువు నివారణ పథకం కింద నీటి సరఫరాకు | : 4,50,000 |
| 12. ఫైనాన్స్ కమీషన్ పథకం కింద నీటి సరఫరా కొరకు | : 4,53,000 |
| 13. జన్మభూమి పథకం కింద మురికి కాల్వలు మరియు నీటి కాలువలు, స్కూల్‌భవనములు రిపేరు | : 92,00,0000 |

84

With Best Compliments From

# KAKINADA DIVISION R&B CONTRACTORS WELFARE ASSOCIATION

Regd.No.7671

## COURT COMPOUND, KAKINADA



President
**NOOKALA RADHA.**
Ph:377082

Vice President:
**J.V.RAMANA.**
Ph:79458

Treasurer:
**K.BABURAO.**
Ph:72995

Gen.Secretary:
**DAKEY BALA KRISHNA RAJU.**
Ph:72952



శుభాకాంక్షలతో...



# సి.ఐ.టి.యు.
# మెదక్ జిల్లా కమిటీ

శ్రామిక్‌భవన్, పటాన్‌చెరు

మెదక్‌జిల్లా

8K

# అభివృద్ధిపథంలో తాడిపత్రి పురపాలక సంఘం

**శ్రీ పేరం నాగిరెడ్డిగారు చైర్‌పర్సన్ మరియు సభ్యులు పదవి చేపట్టినప్పటి నుండి 4 సంవత్సరములు పూర్తి అయిన సందర్భముగా మరియు నూతన సంవత్సరము సందర్భమున పట్టణ ప్రజలందరికీ శుభాకాంక్షలు!**

**త్రాగునీటి సౌకర్యములు:** పట్టణ ప్రజలకు 22 గ్యాలన్లు తలసరి త్రాగునీటిని రోజుకు రెండు పర్యాయములు విడుదల చేయబడుచున్నది. ఇంత వరకు 6650 మీటర్ల పొడవున త్రాగునీటి పైపులైన్లు వివిధ కాలనీలలో వేయబడినవి. రు.100.15 లక్షల వ్యయంతో చేయబడినది. కొత్తగా పబ్లిక్ కుళాయిలు 70, చేతిబోర్లు 69, ఇంటి కుళాయిల కనెక్షన్లు 1450 వేయబడినవి. 1998-99 సం॥లో 24.00 లక్షల వ్యయంతో 2000 మీటర్ల క్రొత్త పైపులైన్లు వేయుటకు చర్యలు గైకొనబడినవి.

**వీధి దీపములు:** లోగడ 1088 వీధి దీపములు వుండగా అదనంగా 200 ట్యూబ్‌లైటు ఫిట్టింగులు అమర్చబడినవి. మరియు 39 ఎం.వి. ల్యాంపులు, 54 ఎస్.వి. ల్యాంపులు క్రొత్తగా అమర్చడమైనది. సి.బి.రోడ్డులో గల విద్యుత్ పోల్స్ రోడ్డుకు చివరన జరిపి విద్యుద్దీకరణ చేపట్టుటకు చర్యలు గైకొనబడుచున్నవి.

**పాఠశాలల నిర్మాణము:** ప్రభుత్వ గ్రాంటులో రు.9.92 లక్షలు ఖర్చు పెట్టి జె.సి. నాగిరెడ్డి స్కూల్ భవనమునకు 5 అదనపు తరగతి గదుల నిర్మాణము పూర్తి చేయబడినది. మరియు జన్మభూమి బహుమతి మొత్తం రు.3.50 లక్షలతో టైలర్స్ కాలనీలో ఎలిమెంటరీ స్కూలు భవనము నిర్మించబడినది. 100 శాతం శ్రమదానంలో శ్రీనివాసపురం హైస్కూల్‌నందు ఒక గది రు.1.20 లక్షలతో నిర్మించబడినది.

**వ్యక్తిగత లెట్రిన్ల నిర్మాణము:** 1059 వ్యక్తిగత లెట్రిన్లు నిర్మించబడి వాటికి రు.30.45 లక్షలు అప్పు మరియు సబ్సిడీలు విడుదల చేయబడినవి.

**రోడ్లు:** 124.00 లక్షల ఖర్చుతో 7327 మీటర్ల రోడ్డు సాధారణ నిధులతో నిర్మించగా రు.123.37 లక్షల ఖర్చుతో జన్మభూమి నిధులు మరియు ప్రజల శ్రమదానంతో 1100 మీటర్ల గ్రావెల్‌రోడ్డు, 7,680 మీటర్ల సిమెంట్ కాంక్రీటు రోడ్డు మరియు 1758 మీటర్ల బండల కాలువలు అన్ని వార్డులలో రెండు పనులకు తక్కువ కాకుండా వేయబడినవి. రు.15.00 లక్షల వ్యయంతో (ఇన్సెంటివ్ గ్రాంటు) 899 మీ. రోడ్లు వేయబడినవి. రు.43.116 లక్షల విలువ గల 100% శ్రమదానం పనులు అనగా పాలిష్, నడకల రోడ్లు, బండల కాలువలు తదితర పనులు చేయబడినవి.

**కాలువలు:** రు.59.57 లక్షల వ్యయంతో 7,562 మీటర్ల కాలువలు నిర్మించబడినవి.

**పార్కుల నిర్మాణము:** రు.1.50 లక్షల వ్యయంతో టైలర్సు కాలనీలో పార్క్ కొరకు ప్రహరీగోడ నిర్మించబడినది. రు.300.00 లక్షల వ్యయంతో ఓపెన్ డ్రెయినేజ్ పథకం అమలు చేయబడుచున్నది.

**షాపు రూములు:** రు.55.85 లక్షల వ్యయంతో ఐ.డి.ఎస్.ఎం.డి. స్కీముతో షాపు రూముల నిర్మాణము చేపట్టుటకు అన్ని చర్యలు గైకొనబడినవి.

**ప్రధానమంత్రి సమగ్ర పట్టణ పేదరిక నిర్మూలన పథకం:** ఈ పథకం ద్వారా ఇంతవరకు అభివృద్ధి పనులకు రు.46.03 లక్షలు ఖర్చు చేసి నీటి సరఫరా పైపులైన్లు, రోడ్ల నిర్మాణము, కాలువల నిర్మాణముగాక, నిరుద్యోగులకు బ్యాంకుల ద్వారా అప్పు మరియు సబ్సిడీ విడుదల చేయబడినవి.

**ఆదర్శకాలనీలు:** పట్టణములోని ప్రజల సహకారంతో ప్రశాంతినగర్, అంబాభవాని, శాస్త్రినగర్, కె.వి.రెడ్డినగర్, బుక్కపట్నంనగర్, వాటర్‌వర్క్సు కాలనీ, గాజులకిష్టప్పవీధి, పంచవటి రోడ్డు, సంజీవనగర్, క్రిష్టాపురంలలో, ఆదర్శ కాలనీలు ఏర్పాటు చేయబడి వివిధ అభివృద్ధి కార్యక్రమములు పూర్తి చేయబడుచున్నవి.

## 1998-99

పెరుగుతున్న జనాభాను దృష్టిలో వుంచుకొని మంచినీటి సరఫరా అభివృద్ధి పరచుటకు అన్ని చర్యలు గైకొనబడినవి. ఏప్రిల్ మాసాంతములోగా పంపింగ్‌ను అభివృద్ధి పరిచి సంవృద్ధికరమైన నీటి సరఫరా చేయుటకు, రు.48.00 లక్షలతో నీటి సరఫరా అభివృద్ధి పథకములో భాగంగా 2వ వార్డు హరిజనవాడలో 2.00 లక్షల గ్యాలనులతో క్రొత్తగా నీళ్ళ ట్యాంకు నిర్మాణము చేపట్టబడును.

రు.200.00 లక్షలతో ఫైర్‌స్టేషన్ వద్దగల 1.88 ఎకరముల స్థలములో 52 షాపు రూముల నిర్మాణమునకు చర్యలు గైకొనబడుచున్నవి.

ఆర్.పి.జి. మున్సిపల్ ఎలిమెంటరీ స్కూల్ స్థలములో 14 షాపు రూములు మరియు ఆర్.టి.సి. బస్టాండ్ వద్ద గల 40 షాపు రూములు నిర్మాణము 1998-99 సం॥లో పూర్తి చేయబడును.

1998-99 ఆర్థిక సంవత్సరములో జన్మభూమి నిధులతో రు.75.00 లక్షల విలువ గల రోడ్ల నిర్మాణము కూడా చేపట్టబడును.

**మున్సిపల్ వార్డు మెంబర్లకు మరియు సిబ్బందికి నూతన సంవత్సర శుభాకాంక్షలు**



**ఎన్.అలీమ్ భాష**
ఎం.ఎస్‌సి., ఎం.ఫిల్.
తాడిపత్రి మున్సిపల్ కమీషనర్





**పేరం నాగిరెడ్డి**
చైర్‌పర్సన్
తాడిపత్రి మున్సిపల్ కౌన్సిల్

మహాసభ తీర్మానాలు

**1999 జనవరి 10, 11, 12 తేదీలలో అనంతపురంలో జరిగిన సి.ఐ.టి.యు. 8వ రాష్ట్ర మహాసభలో**

# ఆమోదించిన తీర్మానాలు

## రాష్ట్రంలో కార్మికుల, ఉద్యోగుల సమస్యలు పరిష్కరించాలి

**కే**ంద్రంలోని బిజెపి సంకీర్ణ ప్రభుత్వంగానీ, రాష్ట్రంలోని తెలుగుదేశం ప్రభుత్వంగానీ గత కాంగ్రెసు ప్రభుత్వం ప్రారంభించిన నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలనే మరింత వేగంగా అమలు జరుపుతున్నాయి. ప్రపంచ బ్యాంకు ఆదేశాల కనుగుణంగా నడుచుకుంటున్నాయి.

ఫలితంగా రాష్ట్రంలో పారిశ్రామిక రంగం క్షీణిస్తున్నది. (Deindustrialisation) బహుళజాతి సంస్థల ప్రయోజనాలకనుగుణంగా సరళీకృత ఆర్థిక విధానాలనుసరించటం వల్ల భారతీయ పారిశ్రామికరంగం తీవ్ర సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నది. బ్రహ్మాండమైన ఆర్థిక, సాంకేతిక వనరులున్న బహుళజాతి సంస్థలతో భారతీయ పరిశ్రమలు తట్టుకోలేకపోతున్నాయి. పైగా ఎక్సైజు పన్ను పెంచటం, దిగుమతి సుంకం తగ్గించటం వల్ల స్వదేశీ మార్కెట్, విదేశీ సంస్థలగుప్పిట్లోకి వెళ్ళుతున్నది. పర్యవసానంగా అనేక భారతీయ పరిశ్రమలు మూతబడటం, లాకౌట్లు, లే ఆఫ్‌లకు దారితీయటం, వందలాది పరిశ్రమలు ఖాయిలాపడటం జరుగుతున్నది.

ప్రభుత్వం అనుసరించే నూతన ఆర్థిక విధానాలవల్ల సుమారు 247పరిశ్రమలు మూతబడి 67929 మంది కార్మికులు వీధిన పడ్డారు. అనేక పరిశ్రమలు లాకౌట్ ప్రకటించారు. రాష్ట్ర ప్రభుత్వరంగ సంస్థలైన ఆల్విన్ ఆటో, ఆర్.ఎఫ్.సి., ఫిషరీస్ కార్పొరేషన్స్ మూసివేసారు. సిరిసిల్ల పవర్‌లూమ్ (5000మంది), మదనపల్లి కాటన్‌మిల్ (1500మంది), రాయలసీమ పేపర్‌మిల్ (1500మంది) రాయలసీమ స్పిన్నింగ్‌మిల్ (900మంది) ఎమ్మిగనూర్ స్పిన్నింగ్‌మిల్ (850మంది) విశాఖ మినీసిమెంట్ యూనిట్ నం.6 (600మంది), మిడ్‌వెస్ట్ ఐరన్ అండ్ స్టీల్ (250మంది, శ్రీకాకుళం) గోల్డ్‌స్టార్ స్టీల్ అండ్ అల్లాయిన్ (300మంది, విజయనగరం), ఆంప్రో బిస్కట్స్ (250మంది, హైదరాబాద్) వంటి అనేక పరిశ్రమలు మూతపడ్డాయి. దేశానికే గర్వకారణమైన ఐ.డి.పి.యల్ పరిశ్రమ దాదాపు మూతపడేస్థితిలో ఉన్నది. హెచ్.ఎం.టి., హెచ్.సి.ఎల్, దివాళాస్థితికి చేరాయి. ప్రభుత్వ విధానాల వల్ల విశాఖ స్టీల్ వంటి పరిశ్రమలు కూడా ప్రమాదంలో పడనున్నాయి.

అనేక పరిశ్రమలు స్వంత ఉత్పత్తులు, స్వతంత్ర మార్కెటింగ్ మానుకుని, ఇతర పెద్ద కంపెనీలకు ఉత్పత్తి చేసి పెడుతున్నాయి. మరికొన్ని తమ కంపెనీలో జరగవల్సిన అనేక ఉత్పత్తులను ఇతర చిన్న కంపెనీలలో కారుచౌకగా ఉత్పత్తి చేయించుకుంటున్నాయి. తమ కంపెనీలో కార్మికులకు పనిలేకుండా పోతున్నది.

రాష్ట్ర ప్రభుత్వం విద్యుత్తు బోర్డును విచ్ఛిన్నం చేసి, ప్రైవేటీకరించేందుకు చట్టంచేసింది. కార్మికులను తొలగించేందుకు మంతనాలు సాగుతున్నాయి. ఆర్టీసీని దొడ్డిదారిన ప్రైవేటీకరిస్తున్నారు. ప్రైవేటు బస్సులు, మాక్సీక్యాబులను అనేక రూట్లలో, పెద్దయెత్తున, ఆర్టీసికి పోటీగా అనుమతిస్తున్నారు. అంగన్‌వాడీ ప్రాజెక్టులను మదర్స్ కమిటీల ఆధ్వర్యంలో నిర్వహించాలని జీ.వో.నం. 48 జారీ చేసింది. ప్రభుత్వ హాస్పిటల్స్‌లో సేవలకు ఫీజులు వసూలు చేయాలని, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు వాలంటరీ ఆర్గనైజేషన్స్‌కు అప్పగించాలని ఆదేశాలు జారీచేసింది. మునిసిపల్ రంగంలో పారిశుధ్యం పనులన్నీ కాంట్రాక్టులకిస్తున్నది. సుబ్రహ్మణ్యం కమిటీ నివేదికపేరుతో రాష్ట్ర ప్రభుత్వరంగ సంస్థలు, కార్పొరేషన్స్‌ను ప్రైవేటీకరించాలని నిర్ణయించింది. ఇప్పటికే అగ్రోస్‌లో 400మందిని, ఎ.పి.ఎస్.ఐ.డి.సి లో 515మందిని, వికలాంగుల కార్పొరేషన్‌లో 407మంది, ఆల్విన్ ఆటో 1750మందిని, ఆల్విన్ రీడిప్లాయిడ్ ఉద్యోగులను 1486మందిని తొలగించారు. ఆల్విన్ రీడిప్లాయిడ్, వికలాంగుల కార్పొరేషన్ ఉద్యోగులు కోర్టు తీర్పు ఆధారంగా కొనసాగుతున్నారు. బొగ్గుగనులలో కూడా ప్రైవేటు పెట్టుబడులు ఆహ్వానించాలని నిర్ణయించింది. ఇప్పటికే అనేక పనులు కాంట్రాక్టుకిస్తున్నది. చివరకు రాష్ట్ర ప్రభుత్వ శాఖల్లోకి కూడా ప్రైవేటీకరణ జరుగుతున్నది. రిజిస్ట్రేషన్స్ అండ్ స్టాంప్స్ శాఖలోను టెక్నికల్ ఎడ్యుకేషన్ అండ్ ఎంప్లాయిమెంట్ ఎక్ఛేంజిలలోను ఇప్పటికే ఈ ప్రయత్నం ప్రారంభమైంది.

అనేక కేంద్ర ప్రభుత్వరంగ సంస్థలలో డిసిన్వెస్ట్‌మెంట్ సాగుతున్నది. బి.హెచ్.ఇ.ఎల్., బి.ఇ.ఎల్ లలో ఇప్పటికే అది ప్రారంభమైంది.

రాష్ట్ర ప్రభుత్వోద్యోగుల సంఖ్య సుమారు 50వేలు తగ్గించాలని నిర్ణయించారు. ఇప్పటికే పరిశ్రమల శాఖ, సహకార శాఖ, సెక్రటేరియట్‌లలో వందలాది పోస్టులు రద్దుచేసారు రిక్రూట్‌మెంట్‌ను నిషేధిస్తూ, కోర్టును ఆశ్రయించే హక్కుకూడా కాలరాస్తూ

ఆక్ట్ 2 ఆఫ్ 1994, ఆక్ట్ 3 అండ్ 27 ఆఫ్ 1998 పేర చట్టాలు చేసారు. కేంద్ర ప్రభుత్వం కూడా ఉద్యోగుల సంఖ్య కుదించే ప్రయత్నంలో ఉన్నది.

రెగ్యులర్ కార్మికుల స్థానంలో క్యాజువల్, కాంట్రాక్టు కార్మికుల వినియోగం పెరుగుతున్నది. తక్కువ వేతనాలు చెల్లిస్తూ, కార్మిక చట్టాలు అమలుచేసే బాధ్యతనుండి సులభంగా తప్పుకోడానికి, . సులభంగా తొలగించేందుకు వీలుగా ఈ పద్ధతి అనుసరిస్తున్నారు.

భారీ, మధ్యతరహా పరిశ్రమలలో కూడా సగానికి పైగా కాంట్రాక్టు కార్మికులనే వినియోగిస్తున్నారు. ప్రభుత్వ ఆసుపత్రులు, ప్రభుత్వరంగ సంస్థలు, ప్రభుత్వశాఖలలో కూడా ఇదే పరిస్థితి. హైదరాబాద్ అపోలో హాస్పిటల్‌లో అనేక సం॥లుగా పనిచేస్తున్న 200మంది రెగ్యులర్ కార్మికులను ఒకేసారి కాంట్రాక్టు కార్మికులుగా మార్చివేసారు.

క్యాజువల్ కార్మికులు వినియోగం కూడా వేగంగా పెరుగుతున్నది. ప్రభుత్వ శాఖలలోను, యూనివర్సిటీలు తదితర సంస్థలలోను పెద్ద సంఖ్యలో పెరుగుతున్నది. ఉస్మానియా, వ్యవసాయ విశ్వవిద్యాలయాలలోనే 4వేలకు పైగా దినసరివేతన ఉద్యోగులున్నారు. ప్రైవేటు పరిశ్రమలగురించి ఇక చెప్పనవసరంలేదు. గతంలో దినసరి వేతన ఉద్యోగిగా చేరి క్రమంగా రెగ్యులరైజ్ అయ్యేందుకు అవకాశం ఉండేది. ఇప్పుడు రిక్రూట్‌మెంట్ నిషేధించారు.

జీ.వో. నం. 212 ప్రకారం కూడా 1993 అక్టోబరు 30నాటికి 5సం॥ నిండిని వారు మినహా మిగతావారికి రెగ్యులరైజ్ అయ్యే అవకాశంలేదు. వారికి కూడా రాష్ట్ర ప్రభుత్వం ఆమోదిస్తేనే, ప్రభుత్వమే ఇలా వ్యవహరించిన తర్వాత ఇక లాభదృష్టితో, చట్టాల అమలునుండి తప్పుకునేందుకే దినసరివేతన ఉద్యోగులను నియమించే ప్రైవేటు యాజమాన్యాలకు హద్దులేదు.

లాభమే పరమావధిగా, విచక్షణా రహితమైన యాంత్రీకరణ పెరుగుతున్నది. దీనివల్ల ఉద్యోగావకాశాలు క్షీణించటమేకాకుండా, ఉన్న ఉద్యోగులను కూడా అదనపు ఉద్యోగులుగా ప్రకటించి తొలగిస్తున్నారు.

అనేక పరిశ్రమలను ఇంకా షెడ్యూల్డు జాబితాలో చేర్చలేదు. 65 షెడ్యూల్డు పరిశ్రమలలో గానీ పార్ట్ ॥ లోని మరో 9 షెడ్యూల్డు పరిశ్రమల జాబితాలోగానీ అనేక రంగాలలో 1991 తర్వాత మళ్ళీ కనీసవేతనాలు సవరించలేదు. అనేక పరిశ్రమలకు ఇంకా కరువుభత్యం వర్తింపజేయలేదు. కాంట్రాక్టు కార్మికులకు కూడా కరువుభత్యంలేదు. గతంలో ప్రతి 2సం॥లకు లేదా ధరల పెరుగుదల సూచీ ప్రతి 50పాయింట్ల పెరగుదలకు కనీస వేతనాలు సవరించాలని ఆదేశాలున్నాయి. అసలే అతి తక్కువ వేతనాలు నిర్ణయిస్తున్నారు. దీనికి తోడు 1995 మే నెలలో జీ.వో.నం. 16పేరుతో కనీస వేతనాలు 5సం॥లకొకసారి మాత్రమే సవరించాలని నిర్ణయించారు. 2సం॥లకు సవరించాలని నిర్దేశించినపుడే ఏ ఒక్క పరిశ్రమలోను సకాలంలో సవరించలేదు. 5సం॥లుగా మార్చటంతో ఇపుడు మరింత జాప్యం జరుగుతున్నది. కార్మికులు పెరుగుతున్న ధరలకు తట్టుకోగల్గే స్థితి లేదు. ముఖ్యంగా లక్షలాది అసంఘటిత కార్మికులు అనేక ఇబ్బందులు పడుతున్నారు. పైగా ఈ మాత్రం కనీస వేతనాలు కూడా యాజమాన్యాలు చాలాచోట్ల అమలు చేయటంలేదు.

ప్రభుత్వం మరో అడుగుముందుకేసి ఉన్న వేతనాలమీద దాడి ప్రారంభించింది. ప్రభుత్వ ఖజానా అంతా ఉద్యోగులవేతనాలకే సరిపోతున్నదని ప్రచారదాడి చేస్తున్నది. బీడీ రంగంలో కరువుభత్యం తగ్గించేందుకు ప్రయత్నిస్తున్నది. శ్రీకాకుళం వాసవీజ్యూట్ మిల్‌లో ఉచితంగా బియ్యం, ఎడ్యుకేషనల్ అలవెన్సు సౌకర్యాలు రద్దుచేసింది. అనేక సంస్థలలో ట్రాన్స్‌పోర్టు, క్యాంటీన్, తదితర సౌకర్యాలు ఎత్తివేస్తున్నారు.

వేతన సవరణ కోరుతున్న కార్మికులకు కౌంటర్‌గా యాజమాన్యాలే డిమాండ్సు పెడుతున్నాయి. వేతనాలు, ఉన్న సౌకర్యాలు కోత విధించుకోవాలని వత్తిడిచేస్తున్నాయి. ఉత్పత్తితో వేతనాలు ముడిపెడుతున్నారు. ఉత్పత్తి తగ్గడానికి యాజమాన్యం, ప్రభుత్వవిధానాలే కారణమైనా కార్మికులే ఆ భారంమోయవల్సివస్తున్నది. హెచ్.ఎం.టి. వంటి ప్రభుత్వరంగ సంస్థలోనే ఇది జరిగింది. సెలవులు తగ్గిస్తున్నారు. కార్మికులు అన్నిరకాల పనులు చేయాలని (మల్టీట్రేడ్) లేనట్లయితే అవసరంలేదని తొలగిస్తున్నారు. శ్రీకాకుళం వాసవీ జ్యూట్‌మిల్ యాజమాన్యం నైపుణ్యం గల కార్మికుడిని, నైపుణ్యం అవసరంలేని పనిలో పెట్టడాన్ని వ్యతిరేకించినందుకు లాకౌటు ప్రకటించింది. పీస్ రేట్ సిస్టం పెరుగుతున్నది. ఇంట్లోనే చేయగల పనులు పెరుగుతున్నాయి. దీనివల్ల వేలాది కార్మికులు పారిశ్రామిక వివాదాల చట్టం పరిధినుండి, ఇతర కార్మిక పనులు పెరుగుతున్నాయి. దీనివల్ల వేలాది కార్మికులు పారిశ్రామిక వివాదాల చట్టం పరిధినుండి, ఇతర కార్మిక చట్టాల పరిధినుండి, ఫ్యాక్టరీ చట్టం నుండి మినహాయించబడి, అనేక సౌకర్యాలు, హక్కులు కోల్పోతున్నారు.

ప్రభుత్వం క్రమంగా పారిశ్రామిక రంగంలో కార్మికులకు ఏదో ఒక మేరకు ఉపయోగపడే అన్ని అంశాలనుండి విరమించుకుంటున్నది. యాజమాన్యాలు మాత్రం మరింత ఎక్కువెక్కువ అండగా నిలుస్తున్నది. కార్మిక చట్టాలను అమలుచేసే యంత్రాంగాన్ని నిర్వీర్యం చేస్తున్నది. చట్టాల అమలుకై జరగవల్సిన తనిఖీలమీద రాష్ట్ర ప్రభుత్వం అనేక ఆంక్షలు విధించింది. పోలీసులకు యాజమాన్యాలకు అండగా ఉపయోగిస్తున్నది. ఇది గతం నుండి ఉన్నప్పటికీ నూతన ఆర్థిక విధానాలు అమలు ప్రారంభమైన తర్వాత తీవ్రమైంది.

కార్మికశాఖ రాను రాను యజమానులశాఖగా మారుతున్నది. అవినీతి, అసమర్థత పెరుగుతున్నది. కార్మికశాఖ అధికారులు యాజమాన్యాలకే

## మహాసభ తీర్మానాలు

వంతపాడుతున్నారు. ఉన్న కొద్దిపాటి అధికారాలు కూడా యాజమాన్యాలకు వ్యతిరేకంగా వినియోగించడానికి సిద్ధంగా లేరు. కార్మిక హక్కులకు భంగం కల్గినపుడు, వేతన సవరణకోరినపుడు యాజమన్యాలకే సహకరిస్తున్నారు. చివరకు, యూనియన్ రిజి(స్ట్రేషన్సను అడ్డుకునే యాజమాన్యాలకు కూడా కొన్ని సందర్భాలలో సహకరిస్తున్నారు.

కార్మిక వివాదాలలో పోలీసుల జోక్యం పెరిగింది. పెరుగుతున్న పోరాటాలను అణచేందుకు పోలీసుల వినియోగం పెరిగింది. హైదరాబాద్ లోని కార్వీ యాజమాన్యం యూనియన్‌ను విచ్ఛిన్నంచేసేందుకు చేసిన ప్రయత్నాలలో నగరపోలీసు యంత్రాంగం ప్రత్యక్షంగా యాజమాన్యానికి సహకరించింది. గోల్డ్‌స్పాట్ లో యూనియన్ రిజిస్ట్రేషన్‌కు ప్రయత్నించిన కార్మికులను పోలీసులు కొట్టి, ప్రయత్నాన్ని ఉపసంహరింపజేశారు. విశాఖ పెప్సీ యాజమాన్యానికి అండగా నిలిచిన పోలీసులు 88మందిమీద కేసులు బనాయించారు. శ్రీకాకుళం శ్యాంపిస్టన్స్, యాజమాన్యానికి వత్తాసు పలికారు. అనేక జిల్లాల్లో కార్మిక వివాదాలలో పోలీసులు జోక్యం చేసుకుని విచ్చలవిడిగా లాఠీఛార్జీలు చేయటం, కేసులు బనాయించటం జరుగుతున్నది. రాష్ట్రంలోని ప్రధాన నగరాలలో ప్రజాతంత్రయుతంగా నిరసన తెలియజేసే అవకాశాలు కూడా లేకుండా అనేక ఆంక్షలు విధించారు.

ట్రేడ్ యూనియన్ హక్కులమీద అటు ప్రభుత్వం, ఇటు యాజమాన్యాలు దాడి తీవ్రతరం చేసాయి.

కార్మికచట్టాలు అనేక లొసుగులతో ఉన్నాయి. అవికూడా సక్రమంగా అమలు చేయటంలేదు. కార్మికుల ప్రయోజనాలకనుగుణంగా కార్మికచట్టాలు సవరించాలని ఎంతోకాలంగా కార్మికోద్యమం కోరుతున్నది. కానీ కేంద్రప్రభుత్వం ఈ చట్టాలన్నింటినీ యాజమాన్యాలకనుకూలంగా సవరించాలని నిర్ణయించింది. యాజమాన్యం ఇష్టాయిష్టాలకనుగుణంగా కార్మికులను తొలగించే అవకాశం ఉండే విధగా కార్మికవివాదాల చట్టాన్ని సవరించాలని, మహిళాకార్మికులచేత రాత్రులు కూడా పనిచేయించేందుకు వీలుగా, 12గం॥ల పనిదినం కూడా అమలు చేసేందుకు వీలుగా ఇంకా అనేక సవరణలకు ప్రయత్నిస్తున్నది. యూనియన్లకు బయటినాయకత్వాన్ని అడ్డుకునేందుకు వీలుగా సవరణలకు ప్రయత్నిస్తున్నది.

రాష్ట్ర కార్మికులు, ఉద్యోగులమీద వృత్తిపన్ను పెంచటంద్వారా అదనపుభారం మోపారు. దీనికి తోడు ఇప్పుడు పేమెంట్ ఆఫ్ వేజెస్ చట్టంలో సవరణకు ప్రయత్నిస్తున్నారు. కార్మికులు ప్రయోజనంకోసం వేతనంలో కోత విధించే అధికారం ప్రభుత్వానికి ఉండాలట! తెల్లరేషన్ కార్డుల సంఖ్య తగ్గించే ప్రయత్నం, విద్యుత్తు ఛార్జీలపెంపు తదితర భారాలన్నీ కార్మికవర్గంమీద పడుతున్నాయి.

కేంద్రంలోను, రాష్ట్రంలోను కాంగ్రెసు, బిజెపి, లేదా టిడిపిగానీ ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా ప్రపంచబ్యాంకు విధానాలే అనుసరిస్తున్నారు. వీటివల్ల ఉద్యోగావకాశాలు క్షీణించటంతోబాటు, వేలాదిమంది కార్మికులు ఉపాధి కోల్పోయి నిరుద్యోగసైన్యంలో చేరుతున్నారు. నిరుద్యోగ సమస్య తీవ్రమవుతున్నది. ఒకవైపు ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. ఇందువల్ల వేతనాలు పెరిగినా నిజవేతనాలు పడిపోతున్నాయి. మరోవైపు వేతనాల మీద దాడి పెరిగింది. ఉన్న వేతనాలు, సౌకర్యాలమీద వేటు పడుతున్నది. వీటికితోడు నిరుద్యోగం, వీటన్నింటి ఫలితంగా దారిద్ర్యం తాండవిస్తున్నది. ఇది సమీప భవిష్యత్తులో పారిశ్రామిక రంగం మరింత సంక్షోభంలోకి కూరుకుపోయేందుకు దారితీస్తుంది. కార్మికులు, ఇతర శ్రామికజనం సమస్యలు అనేకరెట్లు పెరగనున్నాయి. అందువల్ల ఈ నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలు ఉపసంహరించాలని, కార్మికుల, ఉద్యోగుల సమస్యలు పరిష్కరించాలని సి.ఐ.టి.యు. రాష్ట్ర 8వ మహాసభ డిమాండు చేస్తున్నది.

ఈ సమస్యల పరిష్కారం కోసం రాష్ట్ర వ్యాపితంగా అన్ని రంగాల, తరగతుల కార్మికులు, ఉద్యోగులు, ఇతర శ్రామిక ప్రజానీకం సమైక్య పోరాటం నిర్వహించాలని ఈ మహాసభ పిలుపు నిస్తున్నది.

## కులవివక్షత వ్యతిరేక పోరాటాన్ని కొనసాగిద్దాం

న సమాజంలో దళితులు, గిరిజనులు, రజక, క్షురక, మత్స్య, గీత కార్మికులు ఇతర కష్ట జీవులవలె ఆర్థిక దోపిడికి గురౌటంతోపాటు సాంఘిక వివక్షతకు కూడా గురిచెయ్యబడ్తున్నారు. గ్రామసీమల్లోనే గాక పట్టణాల్లో సైతం బస్తీల్లోనే గాక ఫ్యాక్టరీలు, ఆఫీసుల్లో కూడా ఈ వివక్షత వివిధ రూపాల్లో కన్పడుతున్నది. కార్మికుల్లో వున్న ఈ చీలికలను ఉపయోగించుకుని యజమానులు కార్మికవర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్నారు. శ్రమదోపిడికి వ్యతిరేకంగా సాగే పోరాటం సాంఘిక వివక్షత రూపుమాసిపోతే తప్ప జయప్రదం కాదని, అందుకే కుల వివక్షత వ్యతిరేక పోరాట ఉద్యమంలో రాష్ట్ర కార్మికవర్గం పెద్దఎత్తున పాల్గొనాలని సి.ఐ.టి.యు. 8వ రాష్ట్ర మహాసభ పిలుపునిస్తున్నది. రాష్ట్ర ప్రభుత్వం కుల వివక్షతను అంతం చేసేందుకు తగు చర్యలు చేపట్టాలని, ఈ అంశాన్ని జన్మభూమి కార్యక్రమంలో చేర్చాలని ఈ మహాసభ డిమాండు చేస్తున్నది. కుల వివక్షతకు మూలాధారమైన భూస్వామ్య సంబంధాలను బద్దలు కొట్టేందుకు సాగే పోరాటాలలో కార్మికవర్గం ప్రత్యక్షంగా పాల్గొనాలని విజ్ఞప్తి చేస్తున్నది.

గ్రామాల్లో రెండు గ్లాసుల విధానం, దళితులకు దేవాలయ ప్రవేశం లేకపోవటం, ఊరిబావులు, చెరువులు ఉపయోగించుకోనివ్వకపోవటం, వంటి అనేక రకాల వివక్షలతోపాటు దళితులు, గిరిజనులు, రజక, క్షురక, మత్స్య, గీత కార్మికులు పట్టణాల్లో సైతం వివక్షతకు గురౌతున్నారు. ప్రధానంగా దళితులు పైన పేర్కొన్న ఇతర కులాలవారు అత్యధికంగా ఉండే గ్రామసేవకులు, మున్సిపల్ పారిశుధ్య కార్మికులు,

అంగన్‌వాడీలు, ఇతర నాల్గవ తరగతి ఉద్యోగులు, క్యాజువల్, కాంట్రాక్టు కార్మికులు అతి తక్కువ వేతనాలతో దోపిడీ చేయబడటమేగాక, అధికార్లు, కాంట్రాక్టర్ల ఇళ్ళలో వెట్టిచాకిరికి గురౌతున్నారు. ఎంత చాకిరి చేయించుకున్న చివరికి వీరికి మంచినీరు పోయాలన్నా గ్లాసు చేతికివ్వకుండా దోసిలిలో పోస్తున్నారు. దళితులైన పోస్టల్ ఇ.డి. ఉద్యోగులు గ్రామాల్లో ఉత్తరాలు బట్వాడా చేసేటపుడు భూస్వాములు, అగ్రకులాల వారి ఇళ్ళముందు సైకిల్‌పై పోవడానికి వీల్లేదు. దళితులైనందుకు ఒక ఉస్మానియా యూనివర్శిటీ ప్రొఫెసర్‌కు హైదరాబాద్‌లోను, ఒక ఐ.ఎ.ఎస్. ఆఫీసరుకు అనంతపురం జిల్లాలో, ఒక బ్యాంకు మేనేజరుకు పశ్చిమ గోదావరి జిల్లాలోను అద్దెకు ఇళ్ళు దొరకని పరిస్థితి ఎదురైంది. ఒక దళిత మహిళా కండక్టర్‌ను టి.ఐ. "ఒసేయ్" అని సంబోధించిన ఘటన ఇటీవల వెలుగులోకి వచ్చింది. ప్రమోషన్లలో దళితులు కొన్ని సమస్యలెదుర్కొంటుండగా పై పదవిలో వున్న దళితులు కొన్ని సమస్యలెదుర్కొంటుండగా పై పదవిలో వున్న దళిత అధికారులయెడల క్రింది ఉద్యోగులు, చివరికి అగ్రకులాలకు చెందిన అటెండర్లు సైతం చిన్న చూపుచూస్తున్న ఘటనలు వున్నాయి.

భూ కేంద్రీకరణను బద్దలు చేసి దున్నే వాడికే భూమి సంపాదించటం ద్వారా మాత్రమే అగ్రకుల భూస్వాముల ఆర్థిక శక్తిని నాశనం చేయవచ్చు. పేదలైన దళితులు, ఇతర వెనుకబడిన కులాల వారికి భూమి వనరుకల్పించడం ద్వారా అగ్రకుల పెత్తందార్లు, ధనికులపై ఆధారపడకుండా తమ స్వంత కాళ్ళపై నిలబడే స్థితి, కుల పీడనను ప్రతిఘటించే శక్తి వస్తుంది. భూస్వామ్య వ్యతిరేక పోరాటాలు వివిధ కులాల్లోని పేదలను ఒకచోట చేర్చి ఐక్యం చేయటం ద్వారా కులభావాలను బలహీన పరుస్తాయి. వీర తెలంగాణా పోరాట చరిత్ర, బెంగాల్, కేరళ, వామపక్ష ప్రభుత్వాల అనుభవాలు ఈ విషయాన్నే తెలియచేస్తున్నాయి. కుల వ్యవస్థ పునాది ఫ్యూడల్ భూసంబంధాల్లో, భూ కేంద్రీకరణలో వున్నది. అందుకే భూమికోసం, కూలికోసం గ్రామ సీమల్లోని వ్యవసాయ కార్మికులు, ఇతర పేదలుచేసే పోరాటాల్లో కార్మిక వర్గం ప్రత్యక్షంగా పాల్గొనాలి. ఆ ఉద్యమాలకు సంఘర్షణ సహాయ సహకారాలు అందించాల్సిందిగా సి.ఐ.టి.యు. 8వ రాష్ట్ర మహాసభ రాష్ట్ర కార్మికవర్గాన్ని కోరుచున్నది.

ప్రపంచబ్యాంకు ఆదేశిత సరళీకృత విధానాలవల్ల దళితులు, ఇతర పేదల సమస్యలు మరింత పెరిగాయి. విచ్చలవిడి ప్రైవేటీకరణ, ప్రభుత్వరంగ సంస్థల మూసివేతల వల్ల, రిక్రూట్‌మెంట్లపై నిషేధం ఉండటం, ఉద్యోగుల సంఖ్య కుదింపు మొ॥న అంశాలవల్ల మొత్తంగానే ఉద్యోగావకాశాలు దెబ్బతినగా రిజర్వేషన్లు పోయి ఈ తరగతుల ప్రజలు తీవ్రంగా నష్టపోతున్నారు.

కేంద్రంలోను, రాష్ట్రంలోను కాంగ్రెసు, బి.జె.పి. తెలుగుదేశం వగైరా వివిధ పార్టీల ప్రభుత్వాలు వస్తున్నాయి, పోతున్నాయి. కులసమస్యను అదుపు చేసేందుకు పేరుకు పలు చట్టాలున్నాయి. కానీ మొత్తం సంపద, ముఖ్యంగా భూమి, కులవివక్షతను కాపాడే కొద్దిమంది భూస్వాములు చేతుల్లో ఉన్నది. అందువల్ల భూస్వామ్య వ్యతిరేక పోరాటాలకు కార్మికవర్గం అండగా నిలవాలి.

కేంద్రంలో అధికారంలో నున్న బి.జె.పి., సనాతన ఆచారాలను, వర్ణ వ్యవస్థను బలపరుస్తున్నది. ఈ పరిస్థితుల్లో రానున్న కాలంలో సమస్యలు మరింత పెరగనున్నాయి. కార్మికవర్గం ఐక్యంగా నిలబడటం ద్వారానే ఈ పరిస్థితిని ఎదిరించగలం.

ఈ పరిస్థితుల్లో నూతన ఆర్థిక విధానాలకు, కులవివక్షతకు, దానిని కాపాడుతున్న భూస్వామ్య విధానానికి వ్యతిరేకంగా కార్మికవర్గం సమైక్యంగా పోరాడాలి. దళిత సంఘాలు కూడా ఈ సమైక్య పోరాటంలో భాగస్వాములు కావాలి.

# ప్రాంతీయ అసమానతలను రూపుమాపాలి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి 43 సంవత్సరాలు గడుస్తున్నా రాష్ట్రంలోని అనేక ప్రాంతాలు ఇంకా వెనుకబడే వున్నాయి. ప్రాంతీయ అసమానతల మూలంగా రాష్ట్రంలో నెలకొన్న పరిస్థితులపట్ల సి.ఐ.టి.యు. 8వ రాష్ట్ర మహాసభ ఆందోళనను వ్యక్తం చేస్తున్నది. ప్రాంతీయ అసమానతలు రూపుమాపే చర్యలు చేపట్టవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాన్ని ఈ మహాసభ డిమాండు చేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి 43 సంవత్సరాలు పూర్తయింది. ఈనాటికీ రాష్ట్రంలోని తెలంగాణా, రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రాంతాలలో అత్యధిక భాగం, మిగిలిన జిల్లాల్లో కొన్ని ప్రాంతాలు వెనుకబడే వున్నాయి. గతంలో వివిధ పాలనల క్రింద విభజించబడిన తెలుగుజాతి ఐక్యం చేసుకొని ఏర్పరచుకున్న సమైక్య ఆంధ్రప్రదేశ్‌కు వివిధ ప్రాంతాల మధ్య చారిత్రకంగా వచ్చిన అసమానతలు కూడా సంక్రమించాయి. ఈ అసమానతలను రూపుమాపి రాష్ట్ర సమగ్రాభివృద్ధిని పాలకవర్గాలు సాధిస్తాయని అందరూ ఆశించారు. కాని ఈ కాలంలో రాష్ట్రాన్ని దీర్ఘకాలం పరిపాలన చేసిన కాంగ్రెస్ అసమానతలను తొలగించేందుకు కృషి చేయలేదు. పైపెచ్చు కాంగీలో ముఠాతగాదాలు పెరిగినప్పుడల్లా అసమానతలను ఆసరా చేసుకుని ప్రాంతీయ తత్వాలను రెచ్చగొట్టి, పదవులు రాబట్టుకుని పబ్బం గడుపుకున్నారు. తెలుగుదేశం పార్టీ పరిపాలనలో సైతం అసమానతలు తొలగించేందుకు నికరమైన కృషి చేయలేదు.

1991 నుండి దేశంలో అమలు జరుపుతున్న నూతన ఆర్థిక, పారిశ్రామిక విధానాలు అసమానతలు ఇంకా పెంచేవిగా వున్నాయి. కాంగ్రెస్ బి.జె.పి. తెలుగుదేశం పార్టీలు మూడూ ఈ విధానాలను అమలు జరుపుతున్నాయి. రాష్ట్రంలోని తెలుగుదేశం పార్టీ ప్రపంచబ్యాంకు షరతులకు లోబడి అమలు జేస్తున్న సంస్కరణల మూలంగా ప్రాంతీయ అసమానతలు, ఆర్థిక అసమానతలు పెరిగిపోతున్నాయి.

కేంద్రంలోని బి.జె.పి. విధానాలు ఫెడరలిజానికి తీవ్ర నష్టం కల్గిస్తున్నాయి. చిన్న రాష్ట్రాల నినాదంతో అనేక రాష్ట్రాలలో ప్రాంతీయతత్వాన్ని రెచ్చగొడుతున్నాయి. రాష్ట్రంలో స్థానిక సంస్థల హక్కులను నిర్వీర్యం చేయడం ద్వారా అభివృద్ధికి ఆటంకం కల్గిస్తున్నది. ప్రాంతీయ అసమానతలను అధిగమించేందుకు ప్రభుత్వ జోక్యం ఎంతో అవసరం. కాని ఉదారవాద విధానాల అమలులో భాగంగా

**మహాసభ తీర్మానాలు**

ముఖ్యమైన అన్ని బాధ్యతలనుండి ప్రభుత్వం ఉపసంహరించుకుని, మార్కెట్టు శక్తులకు అవకాశం కల్పించడం. అందువలన ఈ విధానాలను మార్చకుండా ప్రాంతీయ అసమానతలను అధిగమించడం సాధ్యంకాదు.

రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలోని కలిసికట్టుగా వున్న వెనుకబడిన ప్రాంతాలను గుర్తించి, ఆ ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక ప్రణాళికలు రూపొందించి, అవసరమైన ఆర్థికవనరులను కేటాయించి, అమలుకోసం తగిన యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి. పాలకులకు రాజకీయ చిత్తశుద్ధి వుంటేనే ప్రాంతీయ అసమానతలను తొలగించేందుకు కృషిజరుగుతుంది. పాలక పార్టీలు ఇప్పటికీ కృషి చేయకపోగా అసమానతల వలన పెరుగుతున్న అసంతృప్తిని ప్రాంతీయ తత్వంలోకి మళ్ళించే ప్రయత్నాలు చేశాయి.

నూతన ఆర్థిక విధానాల మూలంగా ప్రజలలో తీవ్ర అసంతృప్తి పెరుగుతున్నది. భవిష్యత్తులో ఇది ఇంకా పెరుగుతుంది. ఈ అసంతృప్తిని మతతత్వ, ప్రాంతీయ తత్వాలకు కొన్ని శక్తులు రెచ్చగొడుతున్నాయి. ఈ ప్రయత్నాల పట్ల కార్మికవర్గం అప్రమత్తంగా వుండాలని ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తున్నది. ప్రాంతీయ అసమానతల తొలగింపుకు వామపక్ష, ప్రజాతంత్ర శక్తులతో కలిసి కార్మిక వర్గం పోరాడాలని ఈ మహాసభ కోరుతున్నది.

# వ్యవసాయ కార్మికులకు రక్షణ కల్పించే సమగ్ర శాసనం చేయాలి

ఆరుకాలం కాయకష్టం చేస్తూ దుర్భర జీవితం గడుపుతున్న వ్యవసాయ కార్మికుల రక్షణకు సమగ్ర శాసనం చేయవలసిందిగా సి.ఐ.టి.యు. 8వ రాష్ట్ర మహాసభ ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తున్నది.

రాష్ట్రంలో 1 కోటి 16 లక్షల మంది వ్యవసాయ కార్మికులున్నారు. వీరిలో దళితులు, బలహీన వర్గాలకు చెందినవారు, మహిళలు అధిక సంఖ్యలో వున్నారు. గ్రామీణ జనాభాలో సగభాగంగా వుండి, సంపద సృష్టిస్తున్న వీరు ఎలాంటి హక్కులకు నోచుకోవటం లేదు. స్వంత భూమిలేదు కనుక 'కూలే' జీవనాధారమయింది. వీరికి రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితి ఏర్పడింది. తలదాచుకోవడానికి ఇళ్ళకరువు; ఆకలి, అనారోగ్యం, అవిద్య వీరిని అనునిత్యం వెంటాడుతున్నవి. కరువులు, వరదలు తొలుత వీరినే కబళిస్తున్నాయి. కులం పేరిట అవమానాలు, అంటరానితనం, అత్యాచారాలు ఈ వర్గాన్ని వేధిస్తున్నాయి.

నూతన ఆర్థిక విధానాల ప్రభావం వల్ల పరిశ్రమలు అభివృద్ధికాక, అదనంగా భూములు సాగులోకివచ్చే అవకాశాలు లేక ఉపాధి అవకాశాలు మృగ్యమౌతున్నాయి. వృత్తులు దెబ్బతినడంతో వ్యవసాయంలో ఉపాధికోసం వత్తిడి పెరిగింది. వ్యవసాయంలో నాట్లు, కోతలు, నూర్పిడి వంటి పనులలో యాంత్రీకరణ వల్ల ఉపాధి అవకాశాలు కుంచించుకుపోతున్నాయి. వీరికి కనీస కూలీ లభించడంలేదు. సీజన్‌పై ఆధారపడి దొరికే ఉపాధి వల్ల వీరిలో నెలకొన్న 'అసంఘటిత స్వభావం' కనీస కూలి సాధించేందుకు ఆటంకంగా వుంది. పనిభద్రత కరువయింది. ప్రైవేటీకరణల వల్ల రిజర్వేషన్ సౌకర్యం నిరుపయోగమయింది. ధరల పెరుగుదల వీరిపై అదనపు భారాలు వేస్తున్నది.

వ్యవసాయ కార్మికులకు సమగ్ర శాసనం కావాలని అందరూ అంగీకరిస్తారు. కానీ వామపక్ష పాలిత బెంగాల్, కేరళ, త్రిపుర రాష్ట్రాలలో భూసంస్కరణల ద్వారా వ్యవసాయ కార్మికుల ఆర్థికస్థితిని మెరుగుపరిచారు. కనీస కూలీరేట్లు, ప్రావిడెంటుఫండు, పెన్షన్ వంటి అంశాలలో సమగ్ర శాసనం రూపొందించి ప్రత్యేక యంత్రాంగాన్ని ఏర్పరచి అమలు పరుస్తున్నారు. వారికి పూర్తి రక్షణ కల్పిస్తున్నారు. ఇదే పద్ధతిలో సమగ్రశాసనం చేయాలని వామపక్ష పార్లమెంటు సభ్యులు పార్లమెంటులో ప్రైవేటు బిల్లు పెట్టారు. భూస్వామ్య శక్తులు అడ్డుకోవడంవల్ల, ప్రభుత్వానికి చిత్తశుద్ధి లేనందున బిల్లు పాస్‌కాలేదు. మన రాష్ట్ర శాసనసభలో కూడా వామపక్ష శాసనసభ్యులు ఇదే విధంగా చేసిన ప్రయత్నం ఫలించలేదు.

ఈ క్రింది అంశాలతో గూడిన సమగ్ర శాసనాన్ని చేసి వ్యవసాయ కార్మికులకు రక్షణ కల్పించవలసిందిగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను ఈ మహాసభ కోరుతున్నది.

1. వ్యవసాయ కార్మికుల పేర్లు ప్రభుత్వమే రిజిష్టరు చేయాలి.
2. భూవసతి కల్పించటం ద్వారా ఉపాధి అవకాశాలు మెరుగుపరచాలి.
3. కనీస వేతనాల అమలుకు చట్టబద్ధ యంత్రాంగాన్ని ఏర్పరచాలి.
4. మహిళలకు పురుషులతోపాటు సమాన పనికి సమాన వేతనం ఇవ్వాలి.
5. 1956 అగ్రికల్చరల్ ఎంక్వయిరీ కమిషన్ రికమండేషన్ ప్రకారం వ్యవసాయ కార్మికులు రోజుకు 4-30 గంటలే పనిచేయాలి. వారికి పూర్తి వేతనం ఇవ్వాలి.
6. పి.ఎఫ్., పెన్షన్ సౌకర్యం కల్పించాలి.
7. వ్యవసాయ పనులలో వుండగా పకృతి వైపరీత్యాలు, విషకీటకాల వల్ల, పురుగుమందులు చల్లుతూ వ్యవసాయ కార్మికుడు మరణిస్తే నష్ట పరిహారం ఇవ్వాలి.
8. వ్యవసాయ కార్మికులకు గృహ వసతి, రేషన్‌కార్డు, రక్షిత మంచినీరు కల్పించాలి. మరుగు దొడ్లు, రోడ్లు, వీధిలైట్లు వంటి పౌరసౌకర్యాలను నివాస ప్రాంతాలలో కల్పించాలి.
9. విద్య, వైద్యం వసతి కల్పించాలి.
10. సాంఘిక న్యాయం కల్పించాలి. ఎస్.సి., ఎస్.టి.ల రక్షణ చట్టాన్ని సక్రమంగా అమలు పరచాలి.
11. వ్యవసాయ కార్మికుల ఉపాధిని హరించే యాంత్రీకరణను ఆపాలి.
12. ఇ.ఎ.ఎస్., జన్మభూమి పనులు యంత్రాలతో కాక మనుషులతో చేయించాలి.
13. ప్రకృతి వైపరీత్యాల వల్ల ఉపాధిలేని కాలంలో నిరుద్యోగ భృతి ఇవ్వాలి.

పై అంశాలతో గూడిన సమగ్ర చట్టం కోసం చేసే పోరాటాలకు సి.ఐ.టి.యు. పూర్తిగా సహకరిస్తుందని ఈ మహాసభ తెల్పుతున్నది.

130

*Speciality Constructions of All Rice Mills*

**© 24584 P.P.**
**© 228579 (R)**



**M.D.Taj**

# M.D.TAJ

***CONSULTING MECHANIC***

H.No.16-3-27,
C/o Tawakkal Tent House,
Kareemabad Road,
WARANGAL.





M/S.NEWTEC MILLING PRIVATE LTD

MADRAS-600 116

**(Manufacturing of Rice Mills)**

### అధిక దరలకు, నిరుద్యోగం పెరుగుదలకు, పరిశ్రమల మూసివేతకు, పబ్లిక్ రంగం ప్రయివేటీకరణకు, పేటెంటుబిల్లు సవరణకు, ఇన్సూరెన్సు రెగ్యులేటరీ అథారిటీ బిల్లుకు, కార్మిక చట్టాల సవరణకు వ్యతిరేకంగా

# ఫిబ్రవరి 26న నిరసన తెలపండి


కా॥ నండూరి ప్రసాదరావు

సి.ఐ.టి.యు. అఖిల భారత ఉపాధ్యక్షులు


ఉల్లికి ఘాటెక్కువ. కొరికితే నషాళానికెక్కుతుంది. మనిషికే కాదు ప్రభుత్వాలకూ అంతే. ఉల్లి ఘాటుకు ఢిల్లీలో ఉన్న బి.జె.పి. ప్రభుత్వం నెత్తినగుడ్డవేసుకు పోయింది.

బి.జె.పి. నాయకత్వ ప్రభుత్వంలో ఒక ఉల్లిపాయల ధరకే కాదు, ఉప్పు, పప్పులు, నూనెలు, మిర్చి, చింతపండు, ఒకటేమిటి అన్ని నిత్యావసర వస్తువుల ధరలూ పెరిగినవి. ఉప్పుధర కిలో 1కి రు.60కి పెరిగిందంటే ఇక ప్రజల గోడు చెప్పనక్కరలేదు. తరతమ బేధాలతో దేశం అంతా పరిస్థితి ఇదే.

పెరిగాయంటే పెరక్క ఏమి చేస్తాయి. ప్రభుత్వమే వ్యాపార వర్గాల అనుకూల ప్రభుత్వమాయె. ఎన్నికలలో వందల కోట్ల రూపాయలు వాణిజ్య వర్గాల నుండి విరాళాలపేరుతో దండుకున్నదాయె. ఇచ్చానమ్మా వాయినం అంటే పుచ్చుకున్నానమ్మా వాయినం అన్నట్లు విరాళాలిచ్చిన వ్యాపారులు ధరలు పెంచేసిరెండు చేతులా బాగా దండుకున్నారు. ధరల అదుపుకు అనేక చట్టాలున్నాయి. కానీ ప్రభుత్వం వేటినీ ఉపయోగించలేదు. పైగా ఉల్లిపాయల ఎగుమతులను ధారాళంగా చేసుకోనిచ్చింది. చివరకు ఏప్రిల్ నుండీ ధరలు పెరిగితే నవంబరులో ఎగుమతులు నిషేధించి దిగుమతులు చేసుకోవడం ప్రారంభించింది. ఎగుమతి కిలో రు. 4,5లకు చేస్తే దిగుమతి రు. 20 లకు చేసుకుంది. అయినా నిత్యావసర వస్తువుల ధరలు అదుపులో లేకుండా పోయాయి.

దేశంలో నిరుద్యోగం ఎల్లప్పుడూ తాండవిస్తూనే ఉంది. లోగడనే 3కోట్ల 70లక్షల మందికిపైగా నిరుద్యోగులున్నారని ప్రభుత్వమే చెప్తుంది. గ్రామాలలో ఉన్న షుమారు 7కోట్ల మంది నిరుద్యోగులనుకూడా కలుపుకుంటే వీరి సంఖ్య 11కోట్లకు చేరుతుంది. బి.జె.పి. ప్రభుత్వం వచ్చిన తరువాత ఇది మరింత పెరిగింది. ప్రభుత్వం అనుసరించే లిబరలైజేషన్ మూలంగా ఈ నిరుద్యోగం మరీ పెరుగుతోంది. చేనేత, జీడిపప్పు, పీచు మున్నగు పరిశ్రమలు క్షీణిస్తూ ఉండటం మూలకంగా, భారీ పరిశ్రమల విదేశీ పరిశ్రమల పోటీకి తట్టుకోలేక చిన్న పరిశ్రమలు దెబ్బతినటం మూలంగా కార్మికులు ఉపాధిని కోల్పోయారు. పర్మినెంటు కార్మికుల స్థానే క్యాజువల్ కార్మికులను, కాంట్రాక్టు కార్మికులను, టెంపరరీ కార్మికులను వినియోగించుకోవడం వల్ల కూడా ఈ పర్మినెంట్ కార్మికులు నిరుద్యోగలయినా అయినారు లేదా క్యాజువల్ కార్మికులుగానైనా తయారయినారు. ప్రభుత్వ సర్వీసులలో ఎక్కడా కొత్త రిక్రూట్‌మెంట్ లేదు. పబ్లిక్, ప్రయివేటు రంగాలలో 45 లక్షల మంది కార్మికులు అదనంగా ఉన్నారని వారిని తగ్గించడానికి ప్రభుత్వం చూస్తున్నది. అందుకే నిరుద్యోగ మహమ్మారి దేశంలో ప్రధాన సమస్యగా ఉంటున్నది.

లిబరలైజేషన్ మూలకంగా అనేక పరిశ్రమలు మూతపడుతున్నాయి. 4 లక్షలకుపైగా చిన్న పరిశ్రమలు మూతపడుతున్నవని లోగడనే భారతీయ వ్యాపార సంస్థ తెలియజేసింది. విదేశీపోటీకి తట్టుకోలేక ఈ మూసివేతలు ఇంకా పెరుగుతున్నవి. ఖాయిలాపడిన పరిశ్రమలు 2,71,206 ఉన్నవని ప్రభుత్వమే తెలియజేసింది. ఖాయిలా పడినవన్న మాటేగాని వీటిలో అత్యధిక సంఖ్యాకం మూతపడినవే.

పబ్లిక్ రంగ పరిశ్రమలిప్పుడు ఘోర ప్రమాదాన్నెదుర్కొంటున్నవి. మనదేశ ఆర్థిక సౌష్టవానికి ఎంతో తోడ్పడిన పరిశ్రమలను గ్లోబలైజేషన్,లిబరలైజేషన్, ప్రయివేటయిజేషన్ పేరుతో ప్రైవేటుపరం చెయ్యటానికి లేదా మూసివేస్తానికి 1991లోనే కాంగ్రెస్ ప్రభుత్వం పూనుకున్నది. లాభాలొచ్చే పబ్లిక్ రంగ పరిశ్రమల షేర్లను అమ్మివేస్తానికి పూనుకున్నది. నష్టాలు వస్తున్నాయన్న సాకుతో మరికొన్ని పరిశ్రమలను మూసివేస్తానికి పూనుకున్నది. కానీ కార్మికుల ప్రతిఘటన మూలకంగాను, పశ్చిమబెంగాల్‌లోని వామపక్ష ప్రభుత్వం వ్యతిరేకత మూలకంగానూ అది సాధ్యపడలేదు. ఇస్కోను, ముకుంద్ స్టీమ్‌కు అమ్మివేయటం ఆగిపోయింది. నేషనల్ టెక్స్‌టైల్ మిల్లును మూసివేసి 70వేల మంది కార్మికులను బర్తరఫ్ చేసే ప్రయత్నం ఆగిపోయింది. తరువాత వచ్చిన యునైటెడ్‌ఫ్రంట్ ప్రభుత్వం కూడా అదే పాలసీని అవలంభించినా ఏ పరిశ్రమనూ మూసివేయలేకపోయింది. షేర్ల అమ్మకం పూర్తిగా విఫలమయ్యింది. కానీ బి.జె.పి. నాయకత్వ ప్రభుత్వం వచ్చిన వెంటనే సంకురుమయుడు పబ్లిక్ రంగ పరిశ్రమలపై స్వారీ చేయటం ప్రారంభించాడు. ప్రఖ్యాతమయిన ఇండియన్ ఆయిల్ కంపెనీ, గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా, మహానగర్ టెలిఫోన్‌నిగమ్, విదేశీ సంచార నిగమ్, ఎయిర్ ఇండియా ఎయిర్‌లైన్స్ మున్నగు పరిశ్రమల షేర్లను అమ్మివేయటం ప్రారంభమయింది. పబ్లిక్ రంగ పరిశ్రమల షేర్లలో 74 శాతంను స్వదేశీ విదేశీ పెట్టుబడి దారుకమ్మటానికి పూనుకున్నది. మైనింగ్ అండ్ అలైడ్ మిషనరీ కార్పోరేషన్, భారత్ ఆఫ్తాల్మిక్ గ్యాస్ లిమిటెడ్, సిమెంట్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, వేబర్డ్ ఇండియా లిమిటెడ్, రిహాబిలిటేషన్ ఇండస్ట్రీస్ కార్పోరేషన్, నేషనల్ బిల్డింగ్ కన్‌స్ట్రక్షన్స్ కార్పోరేషన్, టేనరీస్ అండ్ ఫుట్‌వేర్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా, భారత్ ప్రాసెస్ అండ్ మెకానికల్ ఇంజనీర్స్ లిమిటెడ్... ఈ 8 కేంద్ర ప్రభుత్వ పరిశ్రమలను మూసివేస్తానికి పూనుకున్నది. పశ్చిమబెంగాల్, బీహారుల్లో 64 బొగ్గుగనులను మూసివెయ్యటానికి నిర్ణయించింది. డైరెక్టుగా 80వేల మంది కార్మికులను భర్తరఫ్ చెయ్యదలిచింది. ఇక ఈ పరిశ్రమలపై ఆధారపడే లక్షలాది మంది సామాన్య ప్రజలు తమ జీవనాధారాన్ని కోల్పోతారు.

2లక్షల కోట్లకుపైగా పెట్టుబడి కలిగి 1997లో మొత్తం పబ్లిక్ రంగ పరిశ్రమలన్నీ 16,120 కోట్ల లాభం సంపాదించాయి. ప్రభుత్వానికి డివిడెండ్‌లు, పన్నులు మున్నగువాటి రూపంలో రు. 37,497కోట్లు

చెల్లిస్తే ఇటువంటి పాడి బర్రెను మాడ్చిచంపటం బి.జె.పి. ప్రభుత్వానికే తగును. మొత్తం 2085 ప్రైవేట్ కార్పోరేషన్లన్నీ కలిసి రు. 279కోట్లు పన్నులు డ్యూటీల రూపంలో చెల్లించిన విషయాన్ని గమనిస్తే ఈ ప్రభుత్వ రంగ పరిశ్రమల ప్రాధాన్యతను మనం గుర్తించగలుగుతాం.

మనదేశం బ్రిటీష్‌వలసగా ఉన్నప్పుడు 1853లో పారిస్‌లో పేటెంట్ల కన్వెన్షన్ జరిగింది. అది తర్వాత అనేక పర్యాయాలు సవరణలు పొందింది. శాస్త్రసాంకేతిక రంగాలలో యూరప్ దేశంలో అతివేగంగా పురోభివృద్ధి చెందుతున్న రోజుల్లో ఈ ఒడంబడిక వాటికనుకూలంగాను ఇతర దేశాలకు ముఖ్యంగా వెనకబడిన దేశాలకు ప్రతికూలంగానూ చెయ్యబడింది. ఒక సరుకును తయారుచెయ్యటంలో ఉపయోగించే ప్రక్రియనేకాక తయారయిన సరుకును కూడా పేటెంట్ చెయ్యడం జరిగింది. అందువలన పేటెంట్ చెయ్యబడిన సరుకు తయారీ ప్రక్రియనుగానీ తయారయిన వస్తువునుగానీ ఎవరూ ఎక్కడా తయారుచేస్తానికి వీల్లేదు. మనదేశం స్వతంత్రం సంపాదించిన తరువాత ఈపేటెంట్లను మనదేశాభివృద్ధికి అనుకూలించే విధఃగా తయారు చెయ్యబడింది. టేక్‌చంద్ కమిటీ, అయ్యంగార్ కమిటీ, హిథీకమిటీల సిపార్సుల ప్రకారం ఈ చట్టం తయారు చెయ్యబడింది. వ్యవసాయోత్పత్తులకు, ఆహారానికి, మందులకు పేటెంట్లులేవు. ఇతర వాటికి తయారుచేసే ప్రక్రియకే పేటెంటు తయారు చేసిన సరుకుకు లేదు. పేటెంట్ చేసేవాడు తన ప్రక్రియను ఇతరులు ఉపయోగించారని ఆరోపణ చేస్తే దాన్ని రుజువు చేసుకునే భారం అతనిపైనే ఉంటుంది. పేటెంట్ చెయ్యబడిన సరుకు కూడా మన దేశంలోనే తయారు చెయ్యాలి. ఇది మన పరిశ్రమాభివృద్ధికి తోడ్పడింది. టెట్రాసైక్లిన్ వంటి ప్లేగు నివారణ మందులను కనిపెట్టడం జరిగింది.

కాని ఈ పేటెంట్ చట్టాన్ని మార్చటానికై మన దేశంపై అధికమైన వత్తిడి తేవటం జరిగింది. గాట్ చర్చలు, డంకెల్ ప్రతిపాదనలు చివరికి ప్రపంచ ఆర్థిక సంస్థ మనదేశం పేటెంట్ చట్టాన్ని మార్చేట్టుగా చెయ్యగలిగాయి. ప్రపంచ ఆర్థికసంస్థలో జేరటం వల్ల వచ్చిన అనర్థకం ఇది. 1992లో పేటెంట్ చట్టాన్ని సవరించటానికి వచ్చిన ప్రతిపాదనలను గట్టిగా వ్యతిరేకించినవారిలో బి.జె.పి ఒకటి. వాజ్‌పేయి, ఆద్వానీ, మురళీమనోహర్‌జోషి, యశ్వంతసిన్హాల మద్దతుతో వారానాడు "మనపేటెంట్ యాక్టును" రక్షించుకోవాలని ఉద్ఘాటించారు. 1996లో తన ఆధ్వర్యంలో జరిగిన సమావేశంలో మురళీమనోహర్ జోషి పేటెంట్ యాక్టుకు "విప్లవాత్మక ఉపన్యాసాన్ని" ఇచ్చాడు కాని వాటనన్నిటినీ మరుగు పరిచి ఇప్పుడు కాంగ్రెస్ మద్దతులో పేటెంట్‌యాక్టును సవరించటానికి పూనుకున్నారు. ఈ మద్దతుతో రాజ్యసభలో పాస్ చేయించుకున్నారు. లోక్‌సభలో పెట్టటానికి దమ్ములేకపోయాయి. అందుకే పార్లమెంటును ప్రోలాగ్ చేసి ఆర్డినెన్స్ చేశారు. దీని మూలకంగా మన వ్యవసాయోత్పత్తులు, ఆహారం ప్రాణప్రదమైన మందులు అన్నీ కూడా, పేటెంట్ చట్టం కిందకు వస్తాయి. లోగడ మన వేపనూనెలో ఔషధ గుణాలున్నాయని పేటెంట్ చేస్తానికి ప్రయత్నించారు. ప్రపంచంలోని అత్యుత్తమైన బసుమతి ధాన్యాన్ని పేటెంట్ చేస్తానికి ఆలోచిస్తున్నారు. ఒకమారు మాత్రమే ఫలించే టెర్మినేటర్ గింజలను పేటెంట్ చేస్తున్నారు. మన శాస్త్రసాంకేతికాభివృద్ధి అడుగంటుతుంది. మన రీసెర్చి అంతమవుతుంది. పేటెంట్ చట్ట సవరణ ఫలితమిది.



పెల్లుబుకిన ప్రజల అసంతృప్తికి నిదర్శనం 1998 డిసెంబర్ 11న జరిగిన అఖిల భారత సార్వత్రిక సమ్మె

ఇన్సూరెన్స్ రంగంలో చొరబాటుకి ప్రయివేటు పెట్టుబడి - ముఖ్యంగా విదేశీ పెట్టుబడి ఎప్పటినుండో ప్రయత్నిస్తుంది. ఇన్సూరెన్స్ రంగం పూర్తిగా పబ్లిక్ రంగ పరిశ్రమ. అతి సమర్థవంతంగా నడుస్తున్న సంస్థ. ఎల్.ఐ.సి. పాలసీ క్లయిములో 97 శాతంను, జి.ఐ.సి.లో 74 శాతంను పరిష్కారం చేసి ప్రపంచంలోనే అగ్రగామిగా ఉన్నది. సంవత్సరానికి రు. 20వేల కోట్లు ప్రభుత్వ ఖజానాకు జేరుస్తున్నది. అనేక ప్రయోజనాలకు, ముఖ్యంగా బిల్డింగ్‌లకు వేల కోట్ల రూపాయలు స్వల్ప వడ్డీ మీద అప్పు ఇస్తున్నది. ఇటువంటి ఇన్సూరెన్స్‌లో 26 శాతం విదేశీ పెట్టుబడికి, 14 శాతం ఎన్.ఆర్.ఐ.లకు మొత్తం 40 శాతం పెట్టుబడి కలిగిస్తానికి పూనుకున్నది.

భారతీయ మజ్దూర్‌సంఘం దేశంలో ఒక ప్రముఖ కార్మిక సంస్థ. అది బి.జె.పి.చే నడపబడుచున్నది. అయినా ఈనాడు బి.జె.పి. నాయకత్వపు ప్రభుత్వ కార్మిక వర్గ ప్రయోజనాలకు వ్యతిరేకంగా కార్మిక చట్టాలన్నిటినీ మార్చటానికి ప్రయత్నిస్తున్నది. ఐ.డి. యాక్టు ట్రేడ్ యూనియన్ యాక్టు, పేమెంట్ ఆఫ్ వేజస్ యాక్టు, కాంట్రాక్టు లేబరు యాక్టు, మున్నగునవన్నీ సమూలంగా మార్చబడబోతున్నవి. యాజమానులు కార్మికులను బర్తరఫ్ చేయటం సులభతరం చేయబడుతున్నది. కార్మికుల పనిగంటలు 8నుండి 12 గంటలకు పెంచబడబోతున్నవి. స్త్రీకార్మికులకు నైట్‌షిఫ్ట్ కూడా పెట్టబడబోతున్నది. ట్రేడ్ యూనియన్‌ల గుర్తింపు కఠినతరం చేయబడుతున్నది. అసలు ట్రేడ్ యూనియన్‌ల రిజిస్ట్రేషనే కఠినతరం చేయబడుతున్నది. పర్మినెంటు కార్మికుల బదులు క్యాజువల్ కార్మికులను, కాంట్రాక్టు కార్మికులను, టెంపరరీ కార్మికులను నియమించడం జరుగుతున్నది. పూర్తిగా విదేశాలకు ఎగుమతయ్యే సరుకులను ఉత్పత్తి చేసే పరిశ్రమలను అన్ని చట్టాల నుండి మినహాయించడానికి ఆలోచించబడుతున్నది. కార్మికులను పర్మినెంట్ చేయటానికి 240 రోజులు గాక 720 పని రోజులుగా నిర్ణయించడానికి ఆలోచించడం జరుగుతున్నది. అవిధేయత, పనిలో నిర్లక్ష్యం మున్నగు కారణాలపై విచారణ లేకుండా కార్మికులను బర్తరఫ్ చేయటానికి ఆలోచన చేయబడుతున్నది. ఈ మార్పులు ట్రేడ్ యూనియన్‌లకు తెలియకుండానే చేయాలని బి.జె.పి. నాయకత్వపు ప్రభుత్వం ఆలోచిస్తున్నది. లేబర్ స్టాండింగ్

కమిటీని పిలవటమే లేదు. 1998 అక్టోబరులో కమిటీ సమావేశాన్ని జరపడానికి నోటీసు ఇచ్చి దానిని కాలనిర్ణయం లేకుండానే వాయిదా వేశారు. వలంటరీ రిటైర్‌మెంటు స్కీం కింద రిటైరయ్యే కార్మికులకు పునరావాసం కల్పించడానికై ఉద్దేశించబడిన నేషనల్ రెన్యువల్ ఫండు పునరావాసం కొరకై ఖర్చు పెట్టబడటం లేదు. ప్రభుత్వపు బడ్జెట్‌లోటును పూడ్చుకోవటానికే వినియోగించబడుతున్నది. ఈ విధంగా కార్మిక వ్యతిరేక మార్పులు చేయిస్తానికి గట్టిగా ఆలోచిస్తున్నారు.

లోగడ కాంగ్రెస్ ఇండస్ట్రియల్ రిలేషన్స్ బిల్ అనే పేరిట ఎటువంటి సవరణలైనా చేస్తానికి పూనుకున్నప్పుడు కార్మికవర్గమంతా ఒక్కటిగా ప్రతిఘటించి దానిని తిప్పికొట్టింది. తర్వాత జనతా ప్రభుత్వం కూడా అందులో ఫెర్నాండెజ్ మంత్రిగా ఉండగా అటువంటి చట్టాన్నే చేయబోతే పార్లమెంటులోనే ఉన్న వామపక్షాలు, బయట కార్మికవర్గం, తీవ్ర ప్రతిఘటనలు చేయటంతో ఆ బిల్లును కూడా కుక్కముట్టుకుపోయింది. ఇలా ప్రతిఘటించిన వారిలో భారతీయ మజ్దూర్ సంఘ్ కూడా వుంది. అయినా పారిశ్రామిక సంబంధాల బిల్లు కంటే కఠినతరమైన షరతులతో కూడుకున్న ఈ మార్పులనిప్పుడు బి.జె.పి. తెస్తున్నది.

బి.జె.పి. నాయకత్వపు ప్రభుత్వం నిస్సిగ్గుగా ఈ సవరణలు తెస్తుంటే, ఆ ప్రభుత్వాన్నే బలపరిచే టి.డి.పి. ప్రభుత్వం మన రాష్ట్రంలో ఒక అడుగు ముందుకు వేసి సవరణలను (ఇప్పటికే) చట్టబద్ధం చేస్తున్నది. ఆల్విన్ రిఫ్రిజిరేషన్ సెక్షన్‌ను ఓల్టాస్‌కి అమ్మివేసింది. కార్మికుల ప్రతిఘటనను లెక్క చెయ్యకుండా. ఆటో డివిజన్‌ను కూడా మూసివేసింది. ఇప్పుడు వాచి డివిజన్‌ను కూడా మూసివేయబోతున్నది. రిపబ్లిక్ ఫోర్జ్‌ని, ఆగ్రోస్ కెమికల్ డివిజన్‌ను మూసివేసింది. ఆ తర్వాత ఫిషరీస్, మాంసం, కోళ్ళ అభివృద్ధి కార్పోరేషన్లను మూసివేసింది. లిడ్‌క్యాప్‌ను, ఇరిగేషన్ కార్పోరేషన్‌ను, వికలాంగుల కార్పోరేషన్‌ను మూసివేయటానికి నిశ్చయించింది. ప్రభుత్వం ఏర్పరిచిన స్టాఫ్‌రివ్యూ కమిటీ 25వేల మంది రెగ్యులర్ ఉద్యోగులను, 36 వేలమంది వర్క్ ఛార్జిడ్ ఉద్యోగులను బర్తరఫ్ చేయాలని పేర్కొంది. ప్రభుత్వ వాహనాల డ్రైవర్లకు ఉద్వాసన పలుకుతున్నారు. 1లక్షా 50వేల మంది ప్రభుత్వ ఉద్యోగులు అదనంగా ఉన్నారని, వారిని వదిలించుకోవాలని ప్రభుత్వం ప్రకటించింది. పారా మెడికల్ సిబ్బందిని కాంట్రాక్టు పద్ధతిపై నియమించాలని, గంటల వద్ధతిలో వేతనాలివ్వాలని నిర్ణయించింది. మున్సిపాలిటీలలో కాంట్రాక్టు పద్ధతిని ప్రవేశపెట్టింది. అంగన్‌వాడీ, గ్రామ సేవకులు, మాబడి టీచర్లు వంటి వారికి జీతాలు లేక గౌరవ వేతనమనే నికృష్టవేతనాలివ్వటం జరుగుతున్నది. అనేక మంది కార్మికులకు కనీస వేతనాలే నిర్ణయించలేదు. నిర్ణయించిన వేతనాలు చాలా కాలం నాటివి. 2 సంవత్సరాల కొకసారి పునర్నిర్ణయించాలనే పద్ధతికి స్వస్తి చెప్పి 5 సంవత్సరాలకు ఒకసారి నిర్ణయించడం జరుగుతున్నది. బీడీ కార్మికుల వేతనాలు తగ్గించి డి.ఎ. తగ్గించటం జరుగుతున్నది.

పాలకొల్లు, సత్తెనపల్లి చక్కెర మిల్లులను; గుంతకల్, నంద్యాల, రాజమండ్రి నెల్లూరు, అంతర్గావ్, సిరిసిల్లలోని నూలుమిల్లులను మూసివేసింది. కార్మికులు కోర్టుకు వెళ్ళే హక్కును రద్దు చేసింది.

ఇవన్నీ ప్రపంచబ్యాంకు ఆదేశాల మేరకు చేయబడిన కార్మిక వ్యతిరేక సంస్కరణలు.

కేంద్రంలో బి.జె.పి. నాయకత్వపు ప్రభుత్వము, రాష్ట్రంలో టి.డి.పి. ప్రభుత్వము అనుసరించే కార్మిక వ్యతిరేక విధానాల ఫలితంగా కార్మికులలో అలజడి, ఆగ్రహం పెరుగుతున్నవి. 1998 డిసెంబర్ 11న అపూర్వంగా జరిగిన దేశవ్యాప్త జనరల్‌సమ్మె దీనినే రుజువు చేస్తున్నది. దీనినింకా ముందుకు తీసుకుపోవలసిన అవసరం ఉన్నది. కార్మిక వర్గాన్ని మొత్తంగా ఈసమస్యలపై చైతన్యవంతం చేయవలసిన అవసరం వుంది.

1999 ఫిబ్రవరి 2వ తారీఖున దేశవ్యాప్తంగా నిరసన దినం పాటించి నిరసన వ్యక్తం చేయాలని సి.ఐ.టి.యు. నిర్ణయించింది. సభలు, సమావేశాలు, ధర్నాలు, ర్యాలీలు మున్నగువాటి ద్వారా ఈ నిరసన తెలపాలని నిర్ణయించింది. ఒక్క సి.ఐ.టి.యు. వెనకనున్న కార్మికులే గాక మొత్తం కార్మికులందరినీ చైతన్యయుతం గావించాలని తలపెట్టింది. కాబట్టి ఫిబ్రవరి 2వ తేదీన నిరసన దినాన్ని దిగ్విజయంగా పాటించవలసిందిగా సి.ఐ.టి.యు. పిలుపునిస్తున్నది. ✪

## ఫిబ్రవరి 2న నిరసన దినం జరపండి

### సి.ఐ.టి.యు. రాష్ట్ర మహాసభ తీర్మానం

బి.జె.పి. నాయకత్వాన ఉన్న కేంద్ర ప్రభుత్వం అనుసరించే వినాశకర ఆర్థిక పారిశ్రామిక విధానాలకు వ్యతిరేకంగా 1998 డిసెంబరు 11న అఖిల భారత జనరల్ సమ్మెను జయప్రదంగా జరిపిన కార్మికవర్గాన్ని రైతాంగాన్ని వ్యవసాయ కార్మికులను, మహిళలను యువజనులను, విద్యార్థులను, కళాకారులను, మేధావులను, ఈ సమ్మెను బలపరిచిన పశ్చిమబెంగాల్, కేరళ, త్రిపుర, అస్సాం, ఒరిస్సా, తమిళనాడు ప్రభుత్వాలను ఆంధ్రప్రదేశ్ 8వ మహాసభ అభినందిస్తున్నది.

బి.జె.పి. నాయకత్వంలోని ప్రభుత్వం తన ఆర్థిక, పారిశ్రామిక విధానాలను మార్చుకొనక మరింత వేగిర పరుస్తున్నది. ప్రభుత్వ రంగ పరిశ్రమలను కొన్నింటిని మూసివేస్తూ తక్కిన వాటిలో 74% షేర్లను అమ్మివేస్తానని అంటున్నది. రోడ్లు, బ్రిడ్జిలు, మున్నగు వాటిలో నూరుశాతం విదేశీ పెట్టుబడిని అనుమతిస్తున్నది. ప్రభుత్వరంగ పరిశ్రమల షేర్లు 74% అమ్మకాన్ని త్వరితం చేస్తున్నది. నిరుద్యోగం పెరుగుతూనే ఉన్నది. దానిని నియంత్రించటానికి ఏ చర్యలు తీసుకోవటం లేదు. ఇన్సూరెన్సు రంగంలో 40% విదేశీ పెట్టుబడిని అనుమతిస్తానికి బిల్లును తెచ్చింది. పేటెంటు చట్టంలో సవరణ చేస్తానికి ఆర్డినెన్సును జారీ చేయాలని నిర్ణయించింది. పారిశ్రామిక వివాదాల చట్టాన్ని ట్రేడ్ యూనియన్ యాక్ట్‌ను, పేమెంట్ ఆఫ్ వేజెస్ యాక్ట్‌ను, కాంట్రాక్టు లేబర్ యాక్ట్‌ను, కార్మిక ప్రయోజనాలకు విరుద్ధంగా సవరించుటకు పూనుకున్నది. వీటన్నిటికీ తోడు సంఘ పరివారం క్రిస్టియన్లపైన, ముస్లింలపైన విపరీతమైన దాడులు చేస్తు ప్రార్థనా స్థలాలను ధ్వంసం చేస్తు నన్స్‌ను మానభంగం చేస్తు వుంటే చూస్తు వూరుకున్నది. బి.జె.పి. నాయకత్వపు ప్రభుత్వం తలపెట్టిన చర్యలు ఇవి.

ఈ పరిణామాలు కార్మికవర్గం యొక్క మొత్తం ట్రేడ్ యూనియన్ ఉద్యమం యొక్క ప్రయోజనాలకు తీరని నష్టం కలుగచేస్తాయి. ఇందుకు వ్యతిరేకంగా సి.ఐ.టి.యు. ఇతర ట్రేడ్ యూనియన్‌లతో కలసి సుదీర్ఘమైన ఆందోళనను గావించ వలసి ఉన్నది. ఈ ఆందోళనలో భాగంగా 1999 ఫిబ్రవరి 2వ తేదీన అఖిల భారత నిరసన దినంను జరపాలని సి.ఐ.టి.యు. పిలుపునిచ్చింది. కాబట్టి 1999 ఫిబ్రవరి 2వ తేదీన నిరసన దినాన్ని జయప్రదం చేయుటకై పూర్తి కృషి చేయవలసిందిగా ఈ మహాసభ కోరుతున్నది.



16A

16C









16E

నూతన కార్యవర్గం ఎన్నికైన సందర్భమున శుభాకాంక్షలతో

# రైస్ మిల్లర్స్ అసోసియేషన్, హుజూర్‌నగర్

నల్గొండ జిల్లా, ఆంధ్రప్రదేశ్ - 508 204. ఫోన్: 51009.


గుండా రామనాగేశ్వరరావు
అధ్యక్షులు


గెల్లి విద్యాసాగర్
ఉపాధ్యక్షులు


గజ్జి ప్రభాకర్
కార్యదర్శి


కొర్లకుంట వెంకటేశ్వరరావు
సహాయ కార్యదర్శి


సింగిరికొండ సత్యనారాయణ
కోశాధికారి

**కార్యవర్గ సభ్యులు:** కామిశెట్టి సోమయ్య, చల్లా లక్ష్మయ్య, చిన్నం శ్రీనివాస్‌రావు, వోరుగంటి కృష్ణమూర్తి, కొత్తా హరిప్రసాద్, ఈగ కిషన్ ★ **ముఖ్య సలహాదారులు:** కొనుగంటి అంతిరెడ్డి, పులిచింతల నర్సింహారెడ్డి

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రీ బాలాజి పార్‌బాయిల్డ్ మోడరన్ రైస్ మిల్<br>మేనేజింగ్ పార్ట్‌నర్: కుక్కడపు రాంమోహన్‌రావు<br>ఇంటి నెం. 51058, మిల్లు నెం.51003 | శ్రీ సాయిబాబా బాయిల్డ్ రైస్ మిల్<br>మే.పా.: ఈగా కిషన్‌రావు<br>ఇం.నెం. 51196, మిల్లు నెం. 51115 | శ్రీ రాజ్యలక్ష్మి బాయిల్డ్ రైస్ దాల్ అండ్ గ్రౌండ్‌నట్ ఆయిల్ మిల్<br>మేనేజింగ్ పార్ట్‌నర్: కొత్తా హరిప్రసాద్<br>ఇంటి నెం. 51082, మిల్లు నెం.51028 | శ్రీ ధనలక్ష్మి పార్‌బాయిల్డ్ మోడరన్ రైస్ మరియు గ్రౌండ్‌నట్ ఆయిల్ మిల్<br>మే.పా.: చల్లా నాగేశ్వరరావు, చల్లా లక్ష్మయ్య<br>ఇం.నెం.51213, మిల్లు నెం. 51069<br>చల్లా లక్ష్మయ్య ఇ.నెం. 51170 | శ్రీ సత్యనారాయణ రైస్ మరియు ఫ్లోర్‌మిల్<br>మేనేజింగ్ పార్ట్‌నర్: నెక్కంటి సోమరాజు<br>మిల్లు నెం.51695, 51162, ఇ.నెం.51613 | తిరుపతి వెంకట మోడరన్ రైస్‌మిల్<br>మే.పా.: ఎస్.వి. రాధాకృష్ణ<br>మిల్లు నెం.51304, ఇ.నెం.51105 |
| శ్రీ లక్ష్మీగణపతి పార్‌బాయిల్డ్ మోడరన్ రైస్ మిల్<br>మేనేజింగ్ పార్ట్‌నర్: గడిపూడి కృష్ణమూర్తి<br>ఇంటి నెం. 51051, మిల్లు నెం.51088 | శ్రీ రామచంద్రా మోడరన్ రైస్‌మిల్<br>మే.పా.: కీతా వెంకటేశ్వర్లు<br>ఇం.నెం. 51076, మిల్లు నెం. 51096 | శ్రీ కనకదుర్గ మోడరన్ రైస్‌మిల్, మఠంపల్లి<br>మేనేజింగ్ పార్ట్‌నర్: కండె వెంకటేశ్వర్లు<br>ఇంటి నెం. 67043, మిల్లు నెం.67033 | చైతన్య మోడరన్ రైస్ బాయిల్డ్ మరియు గ్రౌండ్‌నట్ ఆయిల్ ఇండస్ట్రి<br>మే.పా.: గుండా రామనాగేశ్వరరావు, ఈగా కిషన్ రావు<br>ఇం.నెం. 51024,51196 మిల్లు నెం. 51078 | శ్రీనివాస రైస్ మిల్<br>మేనేజింగ్ పార్ట్‌నర్: చిన్నం శ్రీనివాసరావు<br>మిల్లు నెం.51041 | శ్రీ రామచంద్ర రైస్ మరియు గ్రౌండ్‌నట్ ఆయిల్ మిల్<br>మే.పా.: శింగిరికొండ శ్రీనివాసరావు<br>ఇం.నెం. 51180, మిల్లు నెం.51049 |
| శ్రీ సత్యనారాయణస్వామి పార్‌బాయిల్డ్ మోడరన్ రైస్ మిల్<br>మేనేజింగ్ పార్ట్‌నర్: గజ్జి ప్రభాకర్<br>ఇంటి నెం. 51149, మిల్లు నెం.51111 | శ్రీ సీతారామాంజనేయ పార్‌బాయిల్డ్ మోడరన్ రైస్ మరియు గ్రౌండ్‌నట్ ఆయిల్‌మిల్<br>మే.పా.: కొనుగంటి అంతిరెడ్డి<br>ఇం.నెం. 51012, మిల్లు నెం. 51021 | యాదగిరి లక్ష్మీనర్సింహస్వామి బాయిల్డ్‌రైస్ దాల్ మరియు గ్రౌండ్‌నట్ ఆయిల్ మిల్స్<br>మేనేజింగ్ పార్ట్‌నర్: గెల్లి అప్పారావు<br>ఇంటి నెం. 51063, మిల్లు నెం.51085 | శ్రీ విజయలక్ష్మి రైస్ మరియు ఫ్లోర్‌మిల్<br>మే.పా.: కామిశెట్టి శేషగిరిరావు<br>మిల్లు నెం. 51006 ఇ.నెం.51346 | హనుమాన్ పార్‌బాయిల్డ్ మోడరన్ రైస్‌మిల్<br>మేనేజింగ్ పార్ట్‌నర్: కామిశెట్టి సోమయ్య<br>ఇంటి నెం. 51221, మిల్లు నెం.51117 | **అసోసియేషన్ స్టాఫ్**<br>గుండా వెంకటేశ్వర్లు<br>కొండా లింగారావు<br>టి.వి.రామారావు<br>వెంకటేష్ |
| శ్రీ వెంకటరమణ పార్‌బాయిల్డ్ మోడరన్ రైస్‌మిల్<br>మే.పా.: పులిచింతల నర్సింహారెడ్డి<br>ఇంటి నెం. 51030, మిల్లు నెం.51055 | శ్రీ కన్యకా పరమేశ్వరి పార్‌బాయిల్డ్ మోడరన్ రైస్‌మిల్<br>మే.పా.: సింగిరికొండ సత్యనారాయణ<br>ఇం.నెం. 51128, మిల్లు నెం. 51158 | శ్రీ గౌరీశంకర్ రా, బాయిల్డ్ మరియు గ్రౌండ్‌నట్ ఆయిల్ మిల్<br>మే.పా. : ఒరుగంటి కృష్ణమూర్తి<br>ఇంటి నెం. 51174, మిల్లు నెం.51054 | శ్రీ మహేశ్వరి మోడరన్ రైస్ మిల్<br>మే.పా.: కొర్లకుంట వెంకటేశ్వరరావు<br>మిల్లు నెం. 51348 | శ్రీ అలమేలు మంగా సమేత శ్రీనివాస మోడరన్ రైస్‌మిల్<br>మే.పా. గెల్లి విద్యాసాగర్<br>ఇంటి నెం. 51369, మిల్లు నెం.51095 | |

1-6h

# ధరల పెరుగుదల పర్వంలో 'సుల్తానీ' ఎవరికి ఊడిగం చేసింది?

డా॥ వందనా శివ

ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (IMF)ల వ్యవస్థాగత సర్దుబాటు కార్యక్రమాల ద్వారా 1991లో నూతన ఆర్థిక విధానం రూపంలో వాణిజ్య సరళీకరణ (Trade Liberalisation) ప్రవేశపెట్టబడింది. అనంతరం ప్రపంచ వాణిజ్య సంస్థ (WTO) స్వేచ్ఛా వాణిజ్య విధానం ద్వారా ఇది కళ్ళాలు తెంచుకుంది.

అప్పటి నుండి కేంద్రంలో వరసగా అధికారంలోకి వచ్చిన మూడు వేరు వేరు సిద్ధాంతాలు, భావజాలాలు వున్న ప్రభుత్వాలు ఈ స్వేచ్ఛా వాణిజ్యాన్ని ప్రోత్సహించే విషయంలో మాత్రం నిబద్ధతతో వ్యవహరించాయి. ప్రజాహిత విధానాలకు తిలోదకాలివ్వడం, పౌర సంక్షేమ కార్యక్రమాలను కుదించటం, ప్రభుత్వమే అన్ని నిర్ణయాలు తీసుకోవటాన్ని అధికం చేయటం - ఇటువంటి విధానాల ద్వారా ఆ ప్రభుత్వాలు స్వేచ్ఛా వాణిజ్యాన్ని ప్రోత్సహించాయి.

1991లో మన వ్యవసాయ రంగానికై ప్రపంచ బ్యాంకు ఓ మందు చీటీ రాసి ఇచ్చింది. సెక్టార్ వారీ సర్దుబాటు కార్యక్రమం అనే పేరుతో అందులో ఈ కింది సూచనలు చేసింది.

- వరి, గోధుమ, చెరకు, ప్రత్తి, వంటనూనె మరియు నూనెగింజల పరిశ్రమలను సరళీకృతం చేయటం.
- ఆహార భద్రతా వ్యవస్థకు ప్రభుత్వపరంగా ఇస్తున్న రక్షాకవచాన్ని తొలగించటం.
- వ్యాపారులు, తయారీదారులు, మార్కెట్లపై ఉన్న అదుపుని, అలాగే సహకార రంగానికి ఇచ్చే సబ్సిడీలను ఎత్తివేయటం.
- నిత్యావసర వస్తువుల చట్టాన్ని ఎత్తి వేయటం.
- భవిష్యత్తు వాణిజ్య ఒప్పందాలపై (Futures Trading) ఉన్న నిషేధాన్ని ఎత్తి వేయటం
- నిల్వలపై కంట్రోళ్ళను ఎత్తివేయటం.

కొద్దిమంది గుత్తాధిపతులు, స్వార్థపరులు అపారమైన ధనరాశులు కూడగట్టుకోడానికి, ఇబ్బడిముబ్బడిగా లాభాలు ఆర్జించడానికి ఇదో నికార్సైన 'మందు చీటీ' !

నిత్యావసర ఆహార పదార్థాల ధరలు పెరగటం అనేది వాణిజ్య సరళీకరణలో తప్పనిసరిగా జరిగే ఓ ప్రక్రియ.

ప్రపంచబ్యాంకు ఇండియాపై వెలువరించిన తన 'దారిద్ర్య నివేదిక'లో (Poverty Report on India) - ఇండియా తన వ్యవసాయోత్పత్తుల ధరలు అంతర్జాతీయ స్థాయికి పెరిగేందుకు వీలు కల్పించాలని సిఫారసు చేసింది.

"వ్యవసాయం కొనసాగుతూ ఉండడానికి" అనే పేరుతో 1998లో అది ఈ విధంగా సిఫారసు చేసింది: అంతర్జాతీయ వాణిజ్యంపై ఉన్న నియంత్రణను తొలగించాలి. దేశీయ వాణిజ్యంపై మూవ్‌మెంట్ మరియు స్టోరేజ్ కంట్రోళ్ళ వంటి కంట్రోళ్ళను విధించాలి. TPDS ద్వారా పంపిణీ అయ్యే వరి, గోధుమలకు అన్ని ప్రాంతాల వారికి, అన్ని రుతువులకు ఒకే రకమైన ధరలను నిర్ణయించాలి. ఇలాంటి చర్యల ద్వారా వ్యవసాయోత్పత్తుల ధరలను ప్రపంచ స్థాయి ధరలను అత్యంత చేరువగా తెచ్చేందుకు భారత్ వీలు కల్పించాలి.

అత్యధిక భారతీయులను నుగ్గు నుగ్గు చేస్తున్న ప్రస్తుత సంక్షోభం చాలదన్నట్లుగా, సామాన్య పౌరుడి ఆహార హక్కులను కాలరాసే విధంగా, ప్రపంచబ్యాంకు ఇటువంటి ఆర్థిక విధానాలను మరింతగా రుద్దాలని కోరుకుంటోంది.

భారతీయ ఆదాయాలకు వేతనాలకూ అంతర్జాతీయ ధరలకూ మధ్యనున్న అగాధం ఏం సూచిస్తుందంటే - సరళీకరణ విధానాల ఫలితంగా నిత్యావసర ఆహార పదార్థాల ధరలు అత్యధిక భారతీయులకు అందుబాటులో ఉండనంతగా రానురాను అదే పనిగా పెరిగిపోతుంటాయి.

వాణిజ్య సరళీకరణ స్వభావంలోనే మార్కెట్ ఆటుపోట్లు, ఉన్నట్టుండి సప్లై అదృశ్యమవ్వటం అనే లక్షణాలున్నాయి.

భారతీయ వ్యవసాయ సంబంధిత ఎగుమతులకు 'ఎగుమతి - పోటీతత్వమే' కీలకమనీ, దాని ద్వారా అంతర్జాతీయ మార్కెట్ నుండి ఆహార పదార్థాల కొనుగోలుకు కావలసిన చెల్లింపులు చేయగలమని 'వాణిజ్య పండితులు' పదే పదే వల్లిస్తూ వచ్చారు. ఈ 'ఎగుమతి పోటీతత్వం' పేరుతోనే ఉల్లిపాయల ఎగుమతులను ప్రోత్సహించారు.

'ఎగుమతి పోటీతత్వం' యొక్క విశ్లేషణ ఆధారంగా వచ్చిన ఫలితాలు తెలియజేసేదేమిటంటే - బియ్యం, అరటిపళ్ళు, ద్రాక్ష, సపోటా, ఉల్లిపాయలు, టమోటాలు, కుక్కగొడుగులు వంటి ఉత్పత్తులకు ఎక్కువ పోటీ ఉంది. గోధుమలు, మామిడి పళ్ళు, బంగాళదుంపలు వంటి వాటికి ఓ మాదిరి పోటీ ఉంది. జొన్న, మొక్కజొన్న, సోయాబీన్స్, అయిల్ పామ్, పప్పు దాన్యాలు, కొబ్బరి, లవంగం, మసాలా దినుసులు, నార, మరికొన్ని ఇతర పంటలు తక్కువ పోటీ లేదా ఏ పోటీ లేకుండా ఉన్నాయి.

"ఎగుమతులకు ప్రోత్సాహం" పేరుతో ముందుగా ఉల్లిపాయలను ఎగుమతి చేశారు. దీని ఫలితంగా దేశంలో ఉల్లిపాయలకు కొరత ఏర్పడినప్పుడు ఎగుమతులను నిషేధించారు. పోటీ ప్రయోజనం మాయమైపోయింది. ఇక అప్పుడు ధరల తగ్గింపుకు చేపట్టిన ఒక చర్యగా ఉల్లిపాయల దిగుమతులను ప్రకటించారు. దీని మూలంగా వినియోగదార్లకు ఏమీ ప్రయోజనం లేకపోయింది. చెప్పుకోదగినంతగా వాటి ధరలేమీ తగ్గలేదు. అదే సమయంలో ఈ దిగుమతులు మన రైతుల గిట్టుబాటు ధరలను తీవ్రంగా దెబ్బతీశాయి. ఆహార పదార్థాల అధిక ధరల సమస్య పరిష్కరింపబడే మాట అటుంచి, రైతుల గిట్టుబాటు ధరలు ఘోరాతి ఘోరంగా పడిపోవటం అనే ఓ సరికొత్త సంక్షోభం తలెత్తుంది.

"ఈ ధరల పెరుగుదల 'ఆస్మానీ' (వాతావరణం) వల్లనేగాని మా 'సుల్తానీ' (ప్రభుత్వం/పరిపాలన) వల్ల కాదు." అంటూ మన ప్రధానమంత్రి తన సొంత కవితా ధోరణిలో వాక్రుచ్చారు. ధరల పెరుగుదలకు, అనిశ్చితికి దారి తీస్తున్న వాణిజ్య సరళీకరణ విధానాలు ప్రభుత్వ విధానాలే. కాబట్టి ఇది 'సుల్తానీ' నిర్వాకమే. ఇందులో ఆస్మానీ చేసిందేమీ లేదు. అలాగే వంటనూనె సంక్షోభం, ఉప్పు ధరలు విపరీతంగా పెరగటం, పప్పుధాన్యాల స్వేచ్ఛా దిగుమతి - వీటకీ ఆస్మానీకి ఎలాంటి సంబంధమూ లేదు.

'ధరల పెరుగుదల' నిస్సందేహంగా 'సుల్తానీ' కట్టుకున్న పుణ్యమే. ఆహార - వ్యవసాయ రంగాలలో స్వేచ్ఛా వాణిజ్యాన్ని ప్రోత్సహించడం ద్వారా సుల్తానీ చేసిన నిర్వాకం అది. ఆహారం మరియు వ్యవసాయంపై గుత్తాధిపత్యం నెలకొల్పడం కోసం ప్రపంచ వ్యవసాయ - వ్యాపారం (Agro-Business) మరియు భారతీయ బడా పరిశ్రమల భాగస్వామ్యంతో ప్రభుత్వం ఓ ఆహార సంక్షోభాన్ని సృష్టిస్తోంది.

ఆగస్ట్, సెప్టెంబర్ నెలల్లో ఆవనూనె, ఇతర దేశీయ వంట నూనెల్లో ఓ సంక్షోభం 'సృష్టించ' బడింది. దీనికి పరిష్కారంగా 1. సోయాబీన్స్, సన్‌ఫ్లవర్‌ల స్వేచ్ఛా దిగుమతి. 2. ఒక 'పేకేజింగ్ ఆర్డరు' ..... ప్రకటించబడ్డాయి. మొదటి నిర్ణయం వల్ల భారతీయ రైతులు, నూనె వెలికితీతదారులు నష్టపోగా, ప్రపంచ సోయాబీన్స్ వ్యాపారుల కూటమికి ప్రయోజనం చేకూరింది. ఇక రెండో నిర్ణయం వల్ల - భారతీయ వంటనూనెల్లో 80%వరకు అందిస్తున్న 'ఘని' ఆపరేటర్లు, చిన్న మిల్లుల వారు నష్టపోగా, గింజల నుండి నూనె తీసే బడా పరిశ్రమల వారికి లాభం చేకూరింది.

అక్టోబర్‌లో ఉల్లిపాయల సంక్షోభం నవంబర్, డిసెంబర్ నెలల్లో ఉప్పు, కూరగాయలు, పప్పు ధాన్యాల సంక్షోభం. ఉప్పు ధర పదింతలు పెరిగిపోయి సర్వత్రా భయం వ్యాపించిన వెంటనే

